# సందేశం

(సాంఘిక నాటకం)

అక్కాకుల సుబ్బారావు

సి. వి. రావు పబ్లికేషన్సు
పాత గుంటూరు

సహృదయులకు :

"సందేశం" నాటకం సాధ్యమయినంత కష్టం తీసుకుని వ్రాశాను. కారణం యేమిటంటే? "సందేశం" యొక్క కథ మూడు తరాలకు సంబందించినది. ముందుగా యీకథను చాలా మందికి వినిపించి, దీనినే నాటకంగా వ్రాయాలని వుందన్నాను. అసాధ్య మేమో అన్నారు అందరూ; ఒక్క అమర ప్రసాద్ తప్ప.

అయితే మూడు తరాలను గురించి వ్రాయాలని కాదు నాపుద్దేశ్యం ఈప్రపంచ మంతా ఒక కుటుంబం. పరిస్థితులను బట్టి మానవులు యెలా మారి పోతారో చూపించు టామనే నా ప్రయత్నం. అందుకనే ఒక కుటుంబాన్ని ఆధారంగా తీసు కొని మూడు తరాలుగా వి భ జిం చు కొ ని యీనాటకం వ్రాశాను.

నారాయణరావు దరిద్రుడుగా వున్నప్పుడు సంఘం అతన్ని నీచంగా చూసింది. అందుకని సంఘం మీదా, బంధు వులమీదా విరక్తి కలిగి ద్వేషం వహించాడు. ఆశయాలు, సిద్ధాంతాలు, అతనికి నచ్చవు. డబ్బే అతనికి సర్వస్వం

యవ్వనంలో వున్న "రామానికి" లక్ష్మే సర్వస్వం. తండ్రిని త్యాగం చేయటాని కయినా వెనుదీయడు కానీ లక్ష్మీ ప్రేమను మాత్రం వదలుకోలేదు. అందుకనే తండ్రి దగ్గర శెలవు తీసుకున్నాడు.

అయితే "లక్ష్మి" పరిస్థితి యేమిటి? వృద్ధుడయిన తండ్రిని వదులుకో లేదు. రామాన్ని విడిచి పెట్టలేదు. మరి మార్గం? తనకోసం తండ్రిని త్యాగం చేసుకున్న రామాన్ని అనుసరించక తప్పింది కాదు. అయితే సంతోషంతో కాదు. అగాధమయిన విచారాన్ని హృదయంలో అణచుకొని, అంత రాత్మను ప్రేమకోసం బలిచేసుకొని, ఆవునుంచి వేరు చేయబడ్డ లేగ మాదిరిగా వెళ్ళి పోయింది హృదయాన్నే విడిచిపెట్టి.

ప్రేమకు వారిద్దరూ అమ్ముడు పోయారు. దరిద్రం వారిద్దరినీ ప్రేమలో వేయి చేతులుచాపి కౌగలించు కుంది. జీవితంతో అలసి విసిగి వేసారి నిద్రపోయారు. కష్టాలే వారి కన్నీటిని తుడిచాయి. ఆపదలే వారిని ఆదరించాయి. ఆకలే వారిని విందుకు ఆహ్వానించింది.

దరిద్రం వారిని వేరు చేయ లేదు. వారి జీవిత ప్రకరణంలో "గోపీ" ఒక నూతన జ్యోతిని వెలిగించాడు. అదృష్టం కలసి వచ్చింది. రామం యీనాడు దరిద్రుడు కాడు. ఒకలక్షాధికారి. చీకటి తర్వాత వెలుగు. కష్టంతర్వాత సుఖం సృష్టి యొక్క గుణ పాఠాలు కాబోలు.

జీవితచక్రం పదహారు యేళ్లు గడచింది. సంవత్సరాలు రోజుల్లా రోజులు నిమిషాలు లాగా గడచిపోయాయి. రామం దగ్గరవున్న డబ్బుకూడా క్రమంగా కరిగి పోతోంది. ఉన్న డబ్బుకూడా అయిపోతే "భావి జీవితం" ఏమిటి? "దరిద్రం హేయంగా నవ్వుతూ ఎదురు నిల్చుంది. ఆపదలు హృదయం

మీద సమ్మెట దెబ్బలు కొడుతున్నాయి. ఆకలి దహించుకు పోతోంది. తనగత జీవితం ఒక్కసారిగా కళ్ళకు కట్టింది. అతనిలో యిప్పుడు ఉడుకురక్తం లేదు. కష్టాలను ఓర్చుకోలేదు అతని హృదయం సుఖపడాలి తనకుటుంబం తనగోపీ అందరూ సుఖపడాలి అందుకే "మళ్లీ" ధనార్జన ప్రారభించాడు. "యంత్రం" లాగా కష్టించాడు. అంతేకాదు పూర్తిగా "యంత్రం" లాగా మారిపోయాడు. అన్యాయాలు, అక్రమాలు యిప్పుడతనికి సామాన్యమయిన విషయాలు అతనిలో మానవత్వం పూర్తిగా మృగ్యం. అతను యిప్పుడు ఒక యంత్రం. అతనికి సుఖమంటే అర్థం ఒక్క "డబ్బు" మాత్రమే. వెనుకటి నారాయణరావుకూ యిప్పటి రామానికీ ఏమి భేదంలేదు. ఇదీ జీవితం.

గోపీ తండ్రిపైనే తిరుగుబాటు చేశాడు. లక్ష్మి హృదయం ఒక్కసారిగా అగ్నిపర్వతంలా బ్రద్ధలయ్యింది. చివరకు తండ్రి కూడా నిందించాడు. రామానికి తల తిరిగింది. డబ్బుతో "స్వర్గం" ఒరుగుతుం దనుకుంటే "నరకం" జీవితాల్లో అడుగు పెట్టించ. నిజం నిలకడమీాద తేలింది.

విడిపోయిన "ప్రేమబంధం" వారందరినీ ఒకటిగా చేసింది. ఇదీ వారి జీవితం–

కాలచక్రంలో పరిస్థితులకు మనస్తత్వాలు మారి పోతుంటాయి. దీనికి పరిష్కార మార్గం ఒక్కటే. "మానవు లంతా ఒక్కటే. అందరూ కష్టపడి పని చేయాలి. అందరూ

సుఖించాలి'' ఇదే గ్రామం యొక్క సందేశం. గోపి యొక్క ఆదర్శం.

తర్వాతను యీనాటకం పూర్తి చేయటానికి నాకు ముఖ్యంగా సహాకరించిన మిత్రుడు అమరప్రసాద్. అతని పట్టు దలే యీ నాటకాన్ని ఒక రూపానికి తెచ్చింది— అతనికి నా నమస్కారాలు.

ఈ నాటకాన్ని సరిదిద్ది పరిష్కరించింది నా గురుదేవులు పూజ్యులు (శ్రీ) ఎక్కరాల కృష్ణమాచార్యులుగారు. వారికి నా కృతజ్ఞత.

మిత్రులు అన్నపర్తి, శాస్త్రి, విశ్వం, షేమారావుగార్లు యింకా తదితర మిత్రులు వారి ఆశీర్వాదాలు తెలిపినందుకు వారికి కృతజ్ఞుణ్ణి

ఈ నాటకాన్ని తీసుకొని కష్టాలకు ఓర్చి దీన్ని మీకు పుస్తక రూపంలో అందచేసిన "విశాలాంధ్ర బుక్ హౌస్" వారికి నాకృతజ్ఞతాభి పూర్వక వందనము.

నమస్తే —.శలవు

ఇట్లు,
లక్కాకుల

# సందేశం

## (ప్రథమ దృశ్యము)

నారాయణరావుగారి యిల్లు - దేవుళ్ళ ఫొటోలతో, బాగా అలంకరించబడింది. ఎదురుగా లక్ష్మీదేవి పటం - రెండు, మూడు ఫ్రేముకుర్చీలు, ఒక డ్రాయరు వున్నవి - చూడగానే, ఒక శ్రీమంతుని గృహం అని స్ఫురించాలి. తెర తీయగానే ఎవరూ వుండరు. పదిసెకండ్లలో రామం, హుషారుగా పాట పాడుకుంటూ, మేడ మెట్లమీదనుంచి వచ్చాడు, వయస్సు 24 సం॥లున్నాయి. Dress కేసి చూసుకున్నాడు. అసంతృప్తిగా వున్నట్లుంది. లోపలికి వెళ్ళి చొక్కా మార్చుకొచ్చాడు. చేయివైపు చూసుకున్నాడు. రిష్టువాచి మరచినట్లున్నాడు. గుర్తుకువచ్చి, లోపలకు వెళ్ళి, వాచీ పెట్టుకుంటూ స్టేజీమీద కొచ్చాడు. Chair లో కూర్చుని, Table Mirror లో ముఖం చూసుకున్నాడు. జుట్టు కొద్దిగా చెరిగింది. సరిచేసుకున్నాడు.

"రాగముతో - అనురాగముతో
రావే లలనా - చంద్రవదనా"

అని కూనిరాగం తీసుకుంటూ Table పై వున్న పుస్తకం తీసుకుని - హుషారుగా రెండడుగులు వేసేసరికి దామోదరం ఎదురుగా ప్రత్యక్షమయ్యాడు. వయస్సు 40 సం॥లుంటాయి. రామం ఒక్కసారి వుస్సురనుకుని దామోదరంతో -

రామం :- ఏం దామోదరంగారూ, యిలా దయచేశారేం ?

దా :- (పరకాయించి చూసి) బాగా రెక్కడికో బయలుదేరుతున్నట్లున్నారే -

రామ:- చిత్రం. కనపట్టంలా-అన్నట్లు-ఊరకరారుమహాత్ములు-
వేళకాని వేళల్లో ఏంచేశారు.

దా :- నాన్నగారితో పనుండి.

రామ:- ఏం పనో -

దా :- మరి పనే- కాస్తా కూస్తా పనా - బ్రహ్మాండమైన పని.
యీ భుజాలపై మోసుకొచ్చా.

రామ:- మోసుకొచ్చారా ? మరెక్కడా అగుపించదే ?

దా :- సూక్ష్మబుద్ధి కలవాడవోయ్. చూశావ్ - కల్యాణ
మొచ్చినా - కక్కొచ్చినా ఆగదు.

రామ:- ఏం ? మీకేమయినా, కక్కు రావటంలేదుగదా
కొంపతీసి -

దా :- ఆటకాయితనం యింకా పోలా. కక్కు కాదు. కల్యా
ణమే వచ్చింది.

రామ:- ఎవరికీ, మీకే ?

దా :- ఆc నాకే (వెటకారంగా)

రామ:- అయితే చంపేశారు.

దా :- అయితే చంపదల్చుకోలేదులే. "తాగనూర సందులేదు
గాని మెడకొక ఢోలన్నట్లు" ఉన్నదాంతోటే వేగలేక
చస్తుంటే-పైగా రెండోదికూడానా, ఈ సంగతి వింటే,
అది వీపుమీద చీపురుకట్ట తిరగేస్తుంది - తెలుసా.

రామ:- (నవ్వి) నాన్నగారు పైనున్నారు. వెళ్ళండి.

దా :- ఆగవయ్యా-అంత తొందరేం - అక్కడేదో ముంచుకు
పోతున్నట్లు. సరేగానీ రామం ! చక్కని చుక్కని
మాట్లాడాను. చందమామ లాంటి ముఖం. చందన
పుబొమ్మంటే నమ్మ.

రామ:- ఏమిటీ విూరనేది ?

దా :- పెళ్ళయ్యా పెళ్ళి - నీకు పెళ్ళాన్ని మాట్లాడాను. ఇప్పు డెంత ఇంగ్లీషు చదువు చదివి హేటూ బూటూ వేసినా నీ చిన్నతనంనుంచి ఎరుగుదును. విూ నాన్నా నేనూ ప్రాణస్నేహితులం. అందుకనే లక్ష్మికళ ఉట్టిపడే పిల్లను మాట్లాడాను. ఆ ధర్మయ్య కూతురు లక్ష్మిలాంటి దనుకున్నావేమో. ఆ దరిద్రపుముఖానికి యీ అమ్మా యికీ పోటీయా ? హుం, సాక్షాత్తూ లక్ష్మీదేవేననుకో. ఆ పిల్ల గాలి సోకినా చాలు. లక్ష్మీనిలయ మవుతుంది యిల్లు. వాళ్ళ నాన్న లక్షాధికారి.

రామ:- దామోదరంగారూ ! విూ కేం చెప్పనవసరం లేదు. ఎవరి విషయం వాళ్లే చూసుకోగలరు. పెద్దవారు. యీసారికి వూరుకున్నాను. దయచేసి మరెప్పుడూ యీ ప్రస్తావన తీసుకురాకండి. (విసురుగా బయటికి వెళ్ళిపోయాడు.)

దా :- ఏం కాలమొచ్చిందిరా బాబూ ! మాయదారి కాలం, పెద్దా చిన్నా లక్ష్యమే లేదు. ఈ యింగ్లీషు చదువు లొచ్చాక మరీను, మంచీ మర్యాదా మట్టిపాలయినయి. (ఒక్క చిటికె పొడుం పట్టాడు.)

(నారాయణరావుగారి ప్రవేశం - గంభీరమయిన విగ్రహం. కోరమీసాలు - వయస్సు దాదాపు 45, కళ్ళలో హుందాతనం ఉట్టిపడుతోంది. మేడ మెట్లపైనుండి దిగుతూ-)

నారా:- ఎవరూ ? దామోదరంగారా ?

దా :- చిత్తం. ఒక్కసారి తమ దర్శనం చేసుకుపోదామని వచ్చాను.

నారా:- మంచిది. కూర్చోండి. ఏమిటీ సంగతులు ?

దా :- ఆఁ ఏమున్నాయి. సరేగానీ, నారాయణరావుగారూ ! యింకా మీరు మూఢభావం వహించటం......

నారా:- సంగతేమిటండీ !

దా:- రామం ఆప్పుడే రెండో పుష్కరంలో అడుగు పెట్టబో తున్నాడు.

నారా:- రామం:- వివాహవిషయమా ?

దా:- చిత్తం, బంధువులూ, మిత్రులూ అంతా ఆ శుభకార్యం కోసమే కాచుకూర్చున్నారు. చూడండి. ఎప్పటి ఆనందం అప్పటిదే. ఏ యీడులో జరుపవలసిన శుభ కార్యం ఆ యీడులో జరిపితేనే అచటా ముచ్చటా అయినాను. పైగా మీది ఆడదిక్కులేని సంసారం.

నారా:- ఆ విషయమే నేనూ ఆలోచిస్తున్నా.

దా:- రామానికి, తల్లి ప్రేమ కొరవయినా తల్లీ తండ్రీ మీరే అయి కంటిరెప్పలా పెంచారు. విద్యాబుద్ధులు చెప్పిం చారు. ఇంక ఆ మూడు ముళ్ళూ వేయించారో మీ బాధ్యతా తీరుతుంది. మా ముచ్చటా చెల్లుతుంది. రామంకూడా ఒక యింటివాడవుతాడు.

నారా:- అనుకోండి. మనం తొందరపడితే అవుతుందా, కాలం కలసిరావద్దూ.

దా :- కాలంకోసం చేతులు ముడుచుక్కూర్చుంటే యెలా ? మన ప్రయత్నం మనం చెయ్యొద్దూ. ఆపైన జై సీతారాం.

నారా:- మనకు తగ్గ సంబంధం దొరకవద్దూ.

దా :- అలా అన్నారు సంతోషం. ఈ దామోదరం వంట్లో ప్రాణముండగా పిల్లవిషయం మీకేమీ దిగులవసరం లేదు. సరేనా.

నారా:- ఎక్కడయినా చూశారా యేమిటి సంబంధం ?

దా :- అని నెమ్మదిగా అంటారేం. సంబంధమంటే సంబంధం కాదు. అపూర్వమయిన సంబంధం. మీమీద నాకున్న అభిమానంకొద్దీ యీ సంబంధం వెతకి తీసుకొచ్చాను. మీరు ఊఁ అంటే చాలు. ఇక ఆ పయివిషయాలన్నీ నేను చూసుకుంటాను.

నారా:- మీ మాట యెప్పుడు కాదన్నాం. ఆఁ యింతకూ పిల్ల యెవరో చెప్పారుకాదేం ?

దా :- చెప్తున్నారా. బందరు తాలూకా రామవరం కంభం పాటి రాఘవేంద్రరావుగారి అమ్మాయి. బంగారు బొమ్మంటే నమ్మవలసిందే. ఆ పున్నమచంద్రుడికయినా వంక వుంటుందేమోకానీ యీ అమ్మాయికి మాత్రం వంక పెట్టలేం. సాక్షాత్తూ లక్ష్మీదేవే.

నారా:- అందచందాలకేమిలెండి. ఆ పయిసంగతి ?

దా :- వస్తున్నా. ఆ పయిదానికీ వస్తున్నా. కాలవకిందిమాగాణి పదెకరాలు. అనగా, రూపాయల్లోకిమారిస్తే పది అయిదులు యాభయి వేలన్నమాట. తర్వాత,

మాటకూ నడ్వడకూ చుట్టుప్రక్కల వారిని మించిన చెద్యా లేదు.

నారా:- అలాగా.

దా :- చిత్తం. (Pavese )కానీ ఒక్క విన్నపం. తమరు కోప గించుకోకుండావుంటే -

నారా:- ఏమిటది ?

దా :- అబ్బే—మరేంకాదు. మీా మేలు కోరేవాడిని కనుక ఇంతమాత్రం చెప్పవలసివచ్చింది. ఎవరైనా బాగుపడు తుంటే నాకంటే సంతోషించేవాడూ లేడు. చెడిపో తుంటే నాకంటే విచారించేవాడూ లేడు.

నారా:- ఇంతకూ అసలు విషయం ?

దా :- ఎందుకులే పోనిస్తురూ, లోకులు కాకులు. అనేకం అను కుంటారు. అవన్నీ మనం పట్టించుకుంటామా ?

నారా:- చెప్పండి. ఫర్వాలేదు.

దా :- అయినా మీాదగ్గర నాకు దాపరికమేముంది ? కులం వాడుకదా అని దిక్కూ దివాణం లేని ధర్మయ్యను దగ్గరకుతీసారే అనుకోండి. ఇంతలోకే కళ్లు నెత్తిమీాదకి పోవాలా ? కాస్త వెనకాముందు ఉండక్కర్లా - పది మందిలోనిల్చుని ఏమాటపడితే ఆమాట అనెయ్యటమే.

నారా:- ఏమన్నాడు ?

బా :- ఆఁ యేమనాలి. ఒక్కమాట చాలదూ మర్యాద మంట కలపటానికి. వాడి కూతుర్ని మీ అబ్బాయి చేసుకుంటాడని ఘంటాపథంగా గంటవాగినట్లు వాగుతుంటే నాతోటికూడా అన్నాడు. శివ! శివ! వినలేక చెవులు మూసుకున్నా. మీబోటి శ్రీమంతులకు ఆ దరిద్రులతో సంబంధమా? ఎంత తలవంపులు నాటివారిలో.

నారా:- ఆయన అన్నంతమాత్రాన మనకు పోయిందేముంది? ధర్మయ్యకు ఒరిగిందేముంది? మన జాగ్రత్తలో మన ముంటే సరి.

బా:- అదే జాగ్రత్త పడవలసిందిగా చెప్పటానికే వచ్చా. దీపం వుండగానే యిల్లు చక్కబెట్టుకోవాలి. శృతిమించి, రాగాన పడ్డట్లు ఆలక్ష్మి కూడా రామంతో ఏకచికాలు పరాచికాలు సాయంత్రానికి తోటలో యిద్దరూ హాజరు. ఒకటే కేరింతలూ షికార్లూ ఈ కళ్ళతో చూడలేకపోయాను. బాబూ ఊరంతా ఒకటేగోల ఈడొచ్చిన ఆడపిల్లగదా కాస్త హద్దు పద్దు ఉండక్కర్లా అంటెవిరగబాటూ.

నారా:- వాళ్లి యిద్దరూ చిన్నప్పటినుంచీ అలాగే పెరిగారు లెండి. చిన్ననాటి స్నేహంకదూ.

బా:- అంతే అయితేఫర్వాలేదు. అసలు ధర్మయ్యపేరు అధర్మయ్యంటే యెంతోబాగుండేది. గోముఖవ్యాఘ్రం కదటండీ. నాకు తెలియదా యీయన బ్రతుకు లక్ష్మిని

మీ అబ్బాయికి కట్టబెట్టి యీ ఆస్తినంతా అనుభవించాలనే యీయన నాటకం. లోకానికి తెలిసుందా యేం మనజాగ్రత్తలో మనముంటేసరి. మనబంగారం మంచిదయితే కంసాలి యేం జేస్తాడు గనుక. అందుకనే రామాన్ని కొంచెం అదుపులో వుంచటం మంచిదని...

నారా:- అలాగే.

దా:- బ్రహ్మచారి ముదిరినా బెండకాయ ముదిరినా లాభం లేదంటారు. చేతులు కాలింతర్వాత ఆకులుపట్టుకుని ప్రయోజనమేముంది. చేయిజారకముందే జాగ్రత్త పడటం మంచిది. ఏమంటారు.

నారా:- సరే

దా:- సరేనంటేకాదు ఆ మూడుముళ్ళూ పడితేనే రామం మన రామం. అందులో నేచెప్పే సంబంధం దివ్యమైంది. రాఘవేంద్రరావు గారితో వియ్యమందట మంటే రొట్టె విరిగి నేతిలో పడిందన్నమాటే.

నారా:- అబ్బాయితో కూడా మాట్లాడి ఒప్పిస్తాను లెండి. మంచిరోజు చూసుకొని వధువునుకూడా చూసివద్దాం

దా:- మీరు ఒప్పించాలి. నిర్లక్ష్యంతో కన్నుమూశారో లక్ష్మిని, కాలదన్నుకున్నట్లే. మీ శ్రేయోభిలాషిని కనుక చెప్తున్నా. వస్తా యిక - యిప్పటికే ప్రొద్దు పోయింది.

నారా:- సరే.

దా:- ఆఁ మరేంలేదు యింట్లోది వెచ్చాలేవో పట్టుకు రమ్మంది (నసుగుతూ) ఏదో ఒకరూపాయి కాసు దయచేయిస్తా రేమోనని.

నారా:- (జేబులోంచి తీసి యిచ్చాడు)

దా:- (కనుల కద్దుకని) భగవదార్పణం. శలవు. వచ్చే మాఘ మాసంలో ధప్పళాలు తగలాలి శుభమస్తు. (బయలుదే రాడు ధర్మయ్యఎదురుగుండా సంచితో వచ్చాడు దామో దరం ముఖం చిట్లించుకుంటూ వెళ్ళిపోయాడు. ధర్మయ్య లోపల సంచి పెట్టి మళ్ళావచ్చాడు. నారాయణరావు గంభీరంగా నిల్చున్నాడు.)

ధర్మ:- వస్తా బాబూ యింటిదగ్గర లక్ష్మిఒక్కతే వుంటుంది.

నారా:- ధర్మయ్యా.

ధర్మ:- బాబూ !

నారా:- నీతో చాలారోజుల్నుంచీ, ఒక ముఖ్యవిషయం చెప్పా లనుకుంటున్నాను, కానీ చెప్పలేక పోయాను.

ధర్మ:- ఏమిటది ?

నారా:- రామానికి యుక్తవయస్సు వచ్చింది.

ధర్మ:- అవును.

నారా:- లక్ష్మికికూడా పెళ్ళీడువచ్చింది.

ధర్మ:- (సంతోషంగా) అవును.

నారా:- వాళ్ళిద్దరూ యిప్పుడు చిన్నపిల్లలుకారు. వివాహం కావలసినవాళ్ళు.

ధర్మ:- అవునుబాబూ నేనే హెచ్చరిద్దామనుకుంటున్నాను ఆసంగతి.

నారా:- ధర్మయ్యా, నీ అంతర్యం నాకు తెలుసు. కాని రామం ఒక శ్రీమంతుని కొడుకు. లక్ష్మి యేవిధంగానూ రామానికి సరితూగదు.

ధర్మ:- (బెదిరిపోయి) అంటే-

నారా:- అదే చెప్తున్నా ఒకప్పుడు, బాగాబ్రతికిన వాడివని, సలంవాడివని ఆశ్రయమిచ్చాను. పసిపిల్ల కదాఅని లక్ష్మికి చనువిచ్చాను. ఆ చనువుని అపార్థంచేసుకుని, మూపరువు ప్రతిష్ఠలు మంటకలపకండి.

ధర్మ:- నీ మాటలు నాకర్థం కావటంలేదు బాబూ.

నారా:- వివాహం ఒక్కనాటి సమస్యకాదు. నూరుకాలాల పంట. ఆడపిల్ల తండ్రివికనుక ముందే చెప్తున్నా. పైగా మీరు దరిద్రులు.

ధర్మ:- రామానికీ, లక్ష్మికీ, పెళ్ళి చేద్దామనుకున్నదేగా మనం.

నారా:- ధర్మయ్యా - నాచేత అబద్ధాన్ని ఆడించకు. రామం లక్షాధికారి బిడ్డ. భిక్షాధికారి కూతురుకు కట్టబెడతానని, కలలో కూడా అనుకోవద్దు.

ధర్మ:- అదేమిటి బాబూ ?

నారా:- మా కృతజ్ఞతకు మారుగా, కృతఘ్నత చూపించకండి. తిన్నయింటి వాసాలు లెక్కపెట్టకండి. వేషాలతో వేషాలేయకండి.

ధర్మ:- వేషాలేమిటి ?

నారా:- లక్ష్మిని, యేదోవిధంగా, రామానికి కట్టి బెట్టి నా ఆస్తిని అనుభవించాలనే పన్నాగం నాకు తెలియంది కాదు. చెప్తున్నా వినండి. రామానికి, లక్ష్మికీ, నేను బ్రతికుండగా వివాహం జరుగదు. అంతరాలు, తెలుసుకోకుండా అందలమెక్కాలనుకోవటం అథః పతనానికి నాంది. కళ్ళుమూసుకుని, లక్ష్మి జీవితాన్ని నాశనం చేయకండి.

ధర్మ:- ఆలోచించే అంటున్నావా బాబూ !

నారా:- అంతేకాదు-యిక రామం లక్ష్మిని కలుసుకోవటానికే వీల్లేదు. ముందుగానే జాగ్రత్త పడటం మంచిది. పొరపాటు జరిగినతర్వాత, పశ్చాత్తాప పడటంవల్ల ప్రయోజనం శూన్యం.

ధర్మ:- అపార్థం చేసుకున్నావు నాయనా. లక్ష్మి నాకు ఒక్కగాను ఒక్క బిడ్డ. తల్లి లేకపోయినా పువ్వుల్లోపెట్టి పెంచాను. లక్ష్మిఅంటే నాకు ప్రాణం. ఎన్ని కష్టాలొచ్చినా, లక్ష్మిని చూసుకునే బ్రతికాను. రామం,లక్ష్మి సీతారాముల్లా పెరిగారు. ఇద్దరూ బడికి వెళుతుంటే,

చిలకాగోరింకలన్నారంతా. వాళ్ళిద్దరి చెలిమిచూసి, మనమంతా ఉప్పొంగిపోయాం. దరిద్రమే ప్రేమకు, ప్రతిబంధకమా బాబూ. వారికి, ఎడబాట్లు కల్పించి ఆపసి హృదయాల్ని బాధించటం మనకుమాత్రం శ్రేయస్కరమా. వారి ఆనందమే మన ఆనందంకదూ.

నారా:- దరిద్రంలోనే ఆనందముంటే యింకా బాగుంటుం దేమో - ఇంక, ఆప్రస్థావన ఆపితే మంచిది.

ధర్మ:- డబ్బుకోసం కన్నకూతురికి అన్యాయం చేస్తానా. అంతటి కృతఘ్నుడిని కాదుబాబూ. ధనానికే దరిద్రుడిని కానీ, గుణానికి కాదు. ఒకనాడు మాదీ బాగా బ్రతికిన కుటుంబమే కాని, విధి చిన్నచూపు చూసింది. దరిద్రులమయ్యాం. బళ్ళుఓడలు, ఓడలుబళ్ళూ అవుతాయి. కష్టసుఖాలూ, సృష్టిధర్మమేగా.

నారా:- ఆవిషయాల న్నీఅప్రస్తుతం. చెప్పవలసిన బాధ్యత నాది చెప్పివేశాను.

ధర్మ:- నీబాల్యం ఒక్కసారి ఆలోచించుకో బాబూ. పుట్టుకతోనే, నీవు లక్షాధికారివా ? దేవుడు చల్లనిచూపు చూశాడు. లక్ష్మీకటాక్షం కలిగింది. అదృష్టం కలసి వచ్చింది. ఈనాడు ధనవంతుడవయ్యావు. ఒకప్పుడు నీవు మాత్రం దరిద్రం అనుభవించలా ?

నారా:- అందుకే, ఒకదరిద్రుడి కూతుర్ని నాకొడుక్కి చేసు

కోవటానికి నే నంగీకరించను. మీారీ చర్చ పెంచ నవ సరంలేదు. ఇక మీారు వెళ్ళొచ్చు.

(చివాలున లేచి వెళ్ళిపోతాడు. ధర్మయ్య నిర్విణ్ణుడయి నిలబడివుండగా - రామం హుషారుగా బయటనుంచి వచ్చాడు.)

రామ:- మామయ్యా ?

ధర్మ:- ఏం రామం.

రామ:- అరే అదేమిటీ - అలావున్నావ్.

ధర్మ:- ఆఁ ఏంలేదు బాబూ, బాగానే వున్నానే.

రామ:- కాదు - ఏదో దాస్తున్నావ్ ఏంజరిగింది, మామయ్యా.

ధర్మ:- ఏంలేదు బాబూ - మనసు యెందుకో కలతగావుంది. వస్తా - వస్తా బాబూ. (కంఠం గద్గదమయ్యింది. తన్ను తాను సంబాళించుకుంటూ వెళ్ళిపోయాడు. రామం ఆలోచిస్తూ నిలబడ్డాడు. నారాయణరావు యింట్లో నుండి మేడపైకి వెళ్ళబోతూ - రామాన్నిచూసి)

నారా:- ఎంతసేపయింది వచ్చి.

రామ:- యిప్పుడే.

నారా:- ఎక్కడికెళ్లా వింతసేపూ?

రామ:- ఎక్కడికీ వెళ్లలేదు.

నారా:- మరి యిందాకటినుంచీ యిక్కడలేవేం.

రామ:- అలా మన తోటవైపు వెళ్లాను నాన్నా.

నారా:- ఎందుకు ?

రామ:- షికారుగా.

నారా:- ఒక్కడివేనా - వెంట యింకెవరయినా వున్నారా ?

రామ:- ఎవరూ లేరు ఒక్కడినే నాన్న.

నారా:- అబద్ధాలుకూడా నేర్చావన్నమాట.

రామ:- ( స్తబ్ధు డయ్యాడు. )

నారా:- లక్ష్మికూడా వెంటవుందికదూ. నిజంచెప్పు.

రామ:- (బిక్కపోయి) ఉంది - (తలదించేశాడు.)

నారా:- రామం - కూర్చో -

రామ:- ఏమిటి నాన్నా -

నారా:- ఈ ప్రశ్న లేమిటనా ? చెబుతా కూర్చో.

రామ:- చెప్పండి - ఫర్వాలేదు.

నారా:- నీకు చిన్నతనంలోనే తల్లిప్రేమ కొరవయ్యింది. మనం అప్పుడు నిష్టదరిద్రులం. కులంవాళ్ళంతా ఒకచెయ్యి ఆసరా అందించినవారు లేరప్పట్లో. మనల్ని చాలా నీచంగా చూశారు. పరాభవించారు. ఇప్పుడు మన ప్రక్కనచేరిన యీ బందువ్రులే, ఒకనాడు గేలిచేశారు. కారణం యేమిటో తెలుసా ? (సమాధానం కోసం యెదురుచూశాడు)

రామ:- (మాట్లాడడు)

నారా:- దరిద్రం ఒక మహాపరాధం. మనం దరిద్రులమనే ఉద్దేశ్యంలోనే-లోకం మనల్ని చిన్నచూపు చూసింది. సంఘం వెక్కిరించింది. బంధువులు దూరమయ్యారు. ఆనాడు ఆపదలోవున్న మనల్ని పలుకరించే దిక్కు లేకపోయింది.

రామ:- ఇప్పుడెందుకు నాన్నా యివన్నీ ?

నారా:- నీకు యీవిషయాలు యింతవరకూ చెప్పలేదు. చెప్ప వలసిన అవసరం యీనాడు కలిగింది – చెప్పనీ.

రామ:- నాన్నా !

నారా:- అవును – గడచినవి తలచుకొని వగచి ప్రయోజనం లేదు. యీ సంఘంపైనా, బంధువులపైనా కసి దీర్చు కోవాలనిపించింది. ఆనాటినుంచీ నాలో జాలీ – దయా అన్నిటినీ సమాధిచేసుకున్నా. గుండెలను బండరాళ్లుగా మార్చుకున్నా. పగలు రాత్రనకుండా కష్టించా-కష్టానికి ఫలితం దక్కింది. ఒక్కొక్క చెమట బొట్టును ఒక్కొక్క రూపాయిగా మార్చా. మార్చటానికి మానవత్వాన్నే మరిచిపోయా చివరకు తెలుసుకున్నా రూపాయలు తయారుచేసే ఖార్ఖానాలో-మానవత్వం పనికిరాదనీ, యీ దయా దాక్షిణ్యాలు భూస్థాపితం చేయాలనీ(ఒక్కక్షణం నిశ్శబ్దం) ఈనాడు నేనొకలక్షాధి

కారిని. నేనిప్పుడు – వెనుకటివ్యక్తిని కాదు. వెనుకటి వ్యక్తి పనికిమాలిను. అతనికి బంధువులూ, మిత్రులూ యెవరూ లేరు. కానీ యీనాటి వ్యక్తివేరు. మనిషి మారకపోయినా పరిస్థితులు మారినయి. పరిస్థితుల తో పాటు మానవ నైజాలుకూడా మారిపోయినయి. ఒకనాడు నన్ను దూషించిన బంధువులూ – మిత్రులే యీనాడు మనవాకిట్లో కాపలా కుక్కల్లాతిరుగు తున్నారు. కారణమేమిటో తెలుసా? (సమాధానం కోసం చూశాడు)

రామ:– (మౌనం)

నాన్నా:– నీవు చిన్నవాడివి. వాస్తవజీవితంలో యింకా అడుగు పెట్టలేదు. నా యాభయియేళ్ల అనుభవంలో జీవితంలో సంఘర్షణపడి నేను నేర్చుకోగల్గిన పరమసత్యం ఒక్కటే. అదిడబ్బు – ధనం– ధనం ఉన్నప్పుడే నిన్ను లోకం గుర్తిస్తుంది. ప్రేమిస్తుంది. తప్పులెన్ని చేసినా కప్పిపుచ్చుతుంది. కారణం ముమ్మాటికీ డబ్బే – ఇది ఉపన్యాసం కాదు. బ్రతుకంతా వడపోసి సాధించిన జీవితరహస్యం.

రామ:– పోనీ నాన్నా మనల్ని గౌరవించకుండా మనడబ్బును గౌరవించే మనుష్యులకి – మనంమాత్రం యెందుకు విలువ ఇవ్వాలి.

నారా:- పొరబడుచున్నావు రామం-జీవితమంటే ఆశయాలూ సిద్ధాంతాలూ కావు. ఆచరణలో అసాధ్యం కాబట్టే అవి ఆశయాలూ, సిద్ధాంతాలు కాగలిగాయి. ఆశయ పూర్వకంగా బ్రతకాలను కోవటం కోరి కష్టాలను తెచ్చుకోవటమే. బ్రతుక్కీ ఆశయాలకీ భూమ్యాకాశాల అంతరంవుంది రామం -

రామ:- అయితే అలాబ్రతకటం సాధ్యం కాదంటారా ?

నారా:- ముమ్మాటికీ - నీవు యీనాడు ఒకలక్షాధికారి బిడ్డవి. కాబట్టే సంఘం గౌరవిస్తోంది - ఆదరిస్తోంది రామం, ఒట్టిరామంగా గౌరవమర్యాదలు పొందలేదు.

రామ:- మీరు అపార్థం చేసుకున్నారేమో -

నారా:- తాతకు దగ్గులు నేర్పవలసిన పనిలేదు రామం. నీవు పుస్తకాల్లో ప్రపంచాన్నే చూశావు. కానీ, యధార్థ ప్రపంచం చూడలేదు. అనుభవం పొందితేనే కాని మీనాన్న మాటలు నీ కంతుపట్టవు. యవ్వనం కోడె త్రాచులాంటిది. ఆవేశంజాస్తి. ఆలోచన తక్కువ ఉరకలువేసే ఉడుకురక్తంలో ముందుచూపు మంద గిస్తుందిరామం. చీకట్లో ప్రయాణంచేసి నీగమ్యాన్ని చేరుకోలేవు. వెలుతురులో ప్రయాణం సాగిస్తేనే ఆపదలను గట్టెక్కుతావు. నాజీవితం నీకొక గీటు రాయి. ఇవి అనుభవంలో చెప్పే మాటలు. ఆవే

శాలూ, ఆశయాలూ నీకు ఆనందాన్ని యివ్వలేవు. ఆదారి చాలాకష్టమయింది.

రామ:- నాన్నా-ఆశయాలను సాధించటంలో ఆనందంలేదా? కష్టాన్నికూడా సుఖంగా పరిగణించటం గొప్పతనం కాదూ?

నారా:- అందుకని కోరి కష్టాలను తెచ్చుకుంటామా?

రామ:- ఆశయాలు సాధించలేమని, పిరికివాళ్ళమయి పారిపోతే మానవత్వానికి విలువేముంది? నీతి నిజాయితీలకు స్థానమేముంది?

నారా:- నీతి నిజాయితీలు నీటి అలల్లాంటివి రామం. వాటికి నిలకడలేదు. క్షణంకొక నీతి, ఘడియకొక నిజాయితీ ఒకనాడు భర్తచస్తే ఆడది సహగమనం చెయ్యాలి. ఈనాడు పునర్వివాహం మరొకనీతి-సంస్కరణ ఈ నీతి నిజాయితీలుమధ్య. వీటి నిర్ణేతలుసంఘం, ధనానికి దాసోహమంటున్నప్పుడు - నీతిని కొనిపారెయ్యొచ్చు. అవి నీతినే నీతిగా చెలామణి చేయించవచ్చు.

రామ:- అది అన్యాయంకాదా?

నారా:- ఎవరికి ఆ అన్యాయం ప్రతివాడూ చేస్తున్నదీ అనుసరిస్తున్నదీ అదేఅయితే పదిమందీ నడచేదారే మనదీను.

రామ:- ఇది అంతరాత్మనే మోసపుచ్చుకోవటంకాదానాన్నా?

నారా:- కాదు. బ్రతకటమంటే ఏమిటో నేర్చుకోవటం.

రామ:- అంటే ధనార్జనేగా - ఆత్మను చంపుకుని నీతిని నాశనం చేసుకోమంటారు. దానికి నా మనస్సంగీకరించదు నాన్నా

నారా:- అయితే సుఖంగా బ్రతకలేవు.

రామ:- సంతోషంగా కష్టాలనే ఆశ్రయిస్తాను.

నారా:- ఆశయాలకు బానిస కావటం అవివేకం రామం.

రామ:- ధనానికి దాసులు కావటం వివేకమా నాన్నా ?

నారా:- చిన్నప్పటినుంచీ పెంచి పెద్దచేసి విద్యావంతుడిగా చేసినందుకు - యిది కృతజ్ఞతా.

రామ:- తండ్రిగా మీకర్తవ్యం చేశారు.

నారా:- అయితే కుమారునికి మాత్రం లేదూ ! కర్తవ్యం

రామ:- ఉంది. తండ్రిగా మీకుచేసిన ఉపకారానికి నాజీవితాంతం కృతజ్ఞుడినిగా వుంటాను. కానీ - సత్యవాదిగా తండ్రినేకాదు, ఎవర్నయినా వ్యతిరేకిస్తాను.

నారా:- ఇంతవరకూ వచ్చింది నీ ప్రయోజకత్వం. లక్ష్మి యెన్నివిధాల చూసినా నీకు తగినపిల్లకాదు. ధర్మయ్య కూడా ఒకనాడు శ్రీమంతుడే - ఈనాడు దరిద్రుడు కావటానికి కారణం యెవరో తెలుసా ?

రామ:- యిప్పుడా ప్రస్తావనయెందుకు. మామయ్య దరిద్రుడయినంత మాత్రాన మనకు నష్టమేముంది.

నారా:- ఇన్నిటికీ కారణం లక్ష్మి. లక్ష్మి పుట్టింది తల్లి చచ్చింది. ధనవంతుడయిన ధర్మయ్య దరిద్రుడయినాడు.

రామ:- అన్యం పుణ్యం యెరుగని లక్ష్మి మీద యీ వాదు వేయటం అన్యాయం నాన్నా.

నారా:- ఇది నేనొక్కడినే అన్నమాటకాదు. లోకమంతా యిదే మాటన్నారు.

రామ:- లోకం యెప్పుడూ అంతేగా.

నారా:- ఆ దరిద్ర దేవతను – కోడలుగా చేసుకోవటం నాకు యిష్టంలేదు.

రామ:- నాన్నా !

నారా:- కోరి కోరి దరిద్రాన్ని కోడలుగా చేసుకోలేను.

రామ:- నేను లక్ష్మిని వదలుకోలేను నాన్నా.

నారా:- మనకు సంఘంలో కీర్తి మర్యాదా పరువు ప్రతిష్ఠలున్నాయి. క్షణికమయిన వ్యామోహంకోసం శాశ్వత కీర్తిని బలిచేస్తావా ?

రామ:- మీరు నన్ను పార్థం చేసుకుంటున్నారు. నాన్నా సంఘంలో పరువు ప్రతిష్ఠలూ గౌరవ మర్యాదలూ ధనం ఉన్నంతవరకే యీసంఘంకోసం మేడిపండు లాంటి యీ కీర్తి ప్రతిష్ఠలకోసం – నా ప్రేమను బలిచేసుకోమంటారా ? నాకు కావలసింది – మానవత్వం, ప్రేమా లక్ష్మి. లక్ష్మిని నేనొదులుకోలేను నాన్నా.

నారా:- రామం - (తమాయించుకుని) రామం ప్రేమ ప్రేమ అంటూ పిచ్చివాడివయి పోతున్నావు. అది ఒట్టి భ్రమే ప్రేమనేది వ్యామోహానికి మారుపేరు. క్షణికమయిన వ్యామోహానికి శాశ్వత కీర్తిని నాశనంచేయకు. కలసి వచ్చే లక్ష్మిని కాలదన్నుకోకు - సుఖాన్ని దూరంచేసుకుని నీ తండ్రికి దూరమయిపోకు.

రామ:- కాను. నాతండ్రికి యెన్నటికీ దూరంకాను. కానీ నాది వ్యామోహం కాదు నాన్నా! పవిత్రప్రేమ మీరు ధన వ్యామోహంలోపడి పవిత్రప్రేమకుకలుషితంఆపాదిస్తున్నారు. డబ్బు శాశ్వతమయినదని మిమ్మల్ని మీరే మోసగించుకుంటున్నారు.

నారా:- గ్రుడ్డివాడికి ప్రపంచం చీకటిగానే కన్పిస్తుంది. చెవిటికి శంఖంవూది ప్రయోజనంలేదు. ఫరవాలేదు తండ్రికి నీతులుచెప్పే తనయుడివి ఉద్భవించావ్. అయితే నామాట వినవ్ ?

రామ:- లక్ష్మికి అన్యాయం చేయలేను.

నారా:- కానీ కన్నతండ్రికి మాత్రం చేయగలవ్.

రామ:- నాన్నా!

నారా:- అదృష్టం అందలమెక్కిస్తే దరిద్రం బురదగుంటకు దారితీసిందట.

రామ:- లక్ష్మితో దరిద్రం అదృష్టంగానే భావిస్తాను నాన్నా.

నారా:- రామం - యివి నా కడసారిమాటలు. ఆలోచించుకో. రాబోయే జీవితాన్ని - కలుగబోయే కష్టాలని తల చుకొని గ్రహించుకొని చెప్పు - ఆవేశాన్ని అణచుకొని ఉద్రేకాల్ని అరికట్టి వ్యామోహాన్ని విడనాడి మరీచెప్పు. ఇప్పుడు నీముందర యిద్దరు లక్ష్ములున్నారు. ఒకటి నాఆస్తి. నాప్రేమ గౌరవం మర్యాద అదృష్టానికి ఆటపట్టు ఆదరానికి పట్టుగొమ్మ. కలసివచ్చి కలకాలం సిరిసంపదలలో ఓలలాడిస్తుంది. ఇక రెండవది, ధర్మయ్య కూతురు లక్ష్మి దరిద్రానికి పుట్టినిల్లు. దౌర్భాగ్యానికి మొదటి మెట్టు. దుఃఖానికి నిలయం నరకానికినాంది. ఒకటి స్వర్గం, మరొకటి నరకం.

రామ:- నాన్నా - మాటలతో గారడీ చేయకండి. నా ఆశయా లతో ప్రేమతో నరకాన్నే స్వర్గంగా మార్చుకుంటాను. కష్టంలోనే సుఖం దుఃఖములోనే ఆనందాన్ని పొందు తాను. వస్తానునాన్నా శలవు.

నారా:- వెళుతున్నావా ?

రామ:- వెళతానునాన్నా మానవత్వమూ, ప్రేమా లేని చోటినుంచి దయా దాక్షిణ్యాలు ప్రేమావుండే చోటికి వెళతాను - శెలవు.

నారా:- రామం-నరకంలో అడుగుపెడుతూ, స్వర్గానికి నిచ్చెన లేస్తున్నావు.

రామ:- కాదు. నరకాన్ని స్వర్గం చేసుకోవడానికే వెళుతున్నా సెలవు.

నారా:- కానీ ఒక్కమాట. నిన్ను ఆపగలిగేశక్తి నాలో లేదిప్పుడు. మనయిద్దరి జీవితాలూ తూర్పు పడమరలగా ప్రయాణం చేస్తున్నాయి. సముద్రానికి అవల ఒకరూ యీవల ఒకరూ నిల్చున్నాం. నేను చేయి అందించినా నిష్ఫలమే అవుతుంది. కానీ కష్టాలతో కరడుగట్టిన నాహృదయం బ్రతుకుయొక్క సత్యాన్ని గ్రహించింది. నీవు యీనాడు ఉద్రేకంలో గ్రహించలేక పోయినా ఒకనాడు తప్పక గ్రహిస్తావు. ఆరోజు తప్పకవస్తుంది. తప్పు గ్రహించిన మరుక్షణం నీవు యీ యింట్లోకి స్వేచ్ఛగా రావచ్చు. నాయిల్లు, నాహృదయం నీకు స్వాగతమిస్తాయి. వెళ్ళిరా - యిక వెళ్ళిరా.

రామ:- వస్తాను. నాన్నా. ధనం శాశ్వతంకాదు ప్రేమ శాశ్వతమనీ, మనిషి శాశ్వతంకాదు మాట సత్యమనీ నేను మీకు నిరూపించిననాడు మీరు గ్రహించ గలిగిన నాడు తప్పకుండా వస్తాను నాన్నా సెలవు. (రామం వెళ్ళిపోయాడు. నారాయణరావు దీర్ఘమైన నిట్టూర్పు విడిచాడు. తుఫాను వెలసిన తర్వాత ప్రశాంతం ఆవరించింది.)

నారా:- జీవిత సమరంలో నీవూ ప్రవేశించావు రామం. ఇది తండ్రి కొడుకుల మధ్య తగవుకాదు. జీవితానికీ ఆశయాలకూ, మధ్యజరిగే సంఘర్షణ. గెలుపు నీదో నాదో నిర్ణయించవలసింది కాలం. ఏదిఏమయినా నీకు శుభమే కలగాలని ఆశిస్తాను.

[ ప్రథమదృశ్యం సంపూర్ణం. ]



# సందేశం

## (ద్వితీయ దృశ్యము)

(ధర్మయ్యగారి యిల్లు. అతి సామాన్యంగా ఉన్నది. ధర్మయ్య యేదో ఆలోచిస్తు, పచార్లు చేస్తున్నాడు. ఇంతలో దామోదరం వచ్చాడు)

దా:- (వస్తూనే) నీవు వేయిచెప్పు లక్షచెప్పు ధర్మయ్యా! ఈ లోకంలో ధర్మమే లేదయ్యా.

ధర్మ:- ఏమిటి దామోదరం ?

దా:- ఏముంది అంతా మోసం. పదిరోజుల క్రిందట భద్రయ్యగారి యింట్లో తద్దినం పెట్టా. యివ్వవలసిన రెండు రూపాయిలు తర్వాతయిస్తా నన్నాడుకదా అని, సరే అని వూరుకున్నా. యీరోజు అడిగితే ఆ అంటాడూ అప్పుడే యిచ్చానని. పెద్దమనిషని-పెద్దమనిషి.

ధర్మ:- అలాగా !

దా:- మంచితనాని కివి రోజులు కావయ్యా. నీ బంధువులు మాత్రం సరయిన వాళ్ళనా, అహం అన్నానని కోపం వద్దు. ఉన్నదున్నట్లుగా కుండబ్రద్దలుకొట్టే తత్వంనాది. నీవు బాగుండగా అంతా నీదగ్గర మొక్కారా కష్టంలో వున్నప్పుడు నిన్ను పలుకరించే వాళ్ళున్నారూ ?

ద_ర్మ:- పోనీలే శాస్త్రి.

దా:- ఆఁ పోనీక చేసేదేముందిలే. అయినా వీళ్ళబుద్ధికి చెపుతా ఇప్పుడంతా ఆ నా రా య ణ రా వు గా రి ప్రక్క చేరి రామానికి యెక్కడో సంబంధం చూస్తున్నారట. నీతికి నిలబడేవాడు ఒక్కడూ లేకపోతే - మనకళ్ళ యెదుట మంచిగా మాట్లాడేవాళ్ళే వెనకాల గోతులు త్రవ్వుతుంటారు.

ధర్మ:- ఒకళ్ళ సంగతి మనకెందుకులే దామోదరం.

దా:- ఒకళ్ళ సంగతికాదు. మ న సం గ తే అట్లావుంది. నీ వియ్యంకుడు మాత్రం సామాన్యుడనుకున్నావా యేం? ఇందాక మాటసామెతగా లక్ష్మి, రామం పెళ్ళిసంగతి యెత్తగానే, కస్సుమన్నాడు. ఎంతో చెప్పా. వింటేనా చెవిని పట్టించుకుంటేనా !

ధర్మ:- దామోదరం అనుకుని ఏంప్రయోజనం చెప్పు రాతలు యెలా వ్రాసిపెట్టివుంటే అలా జరుగుతుంది. కానీ -

దా:- రామం లక్ష్మి యీడూ జోడూ చిలకా గోరింకల్లాగుం టారంటే ఒప్పుకుంటేనా. ఎవడో కట్నం యిస్తానన్నాట్ట. వాడి పిల్లనే చేసుకుంటాడట. డబ్బుముఖం చూసుకుం టారుకానీ మనిషిముఖంచూడరే.

ధర్మ:- పోనీలే దామోదరం ?

దా:- అంతేలే. యింతలోకే లక్ష్మికి మొగుడు దొరకడనా ?

పెళ్ళికాదనా? నువ్వు ఊఁ అంటే చాలు, యిప్పుడంటే యిప్పుడు దివ్యమైన సంబంధం తీసుకురానూ. ఆఁ అన్నట్టు లక్ష్మియేది?

ధర్మ:- ఇంట్లోనేవుంది.

దా:- ఆఁ యేంలేదు ఇంట్లో దాంతోటి మరీ చావయిపోయింది. యింట్లో బియ్యం కూడా నిండుకున్నాయి. ఒక్క సోలెడు బియ్యం మనయింట్లో దొరుకుతాయేమోనని.

ధర్మ:- దానికేం దామోదరం తీసుకెళ్ళు. అమ్మాయి లక్ష్మి లక్ష్మి -

(లక్ష్మివచ్చింది. ఆభరణాలు లేకుండా అతిసామాన్యంగా వున్నా ముఖంలో అందం తొణికిసలాడుతుంది.)

లక్ష్మి:- ఏమిటినాన్నా.

ధర్మ:- ఆఁ యేంలేదమ్మా దామోదరంగారికి యింట్లోబియ్యం నిండుకున్నాయట. ఒక్కసోలెడు బియ్యం తెచ్చివ్వు.

లక్ష్మి:- అలాగేనాన్నా (లోపలకి వెళ్ళింది.)

దా:- అదృష్టంఉండొద్దూ ధర్మయ్యా. డబ్బుముఖం చూసుకుని లక్ష్మిని దూరంచేసుకున్నాడు. అతనెంతచేసు, అతని డబ్బెంతచేసు. లక్ష్మి నవ్వు నవ్వితేచాలే ముత్యాలు రాల్తాయి.

(ఇంతలో లక్ష్మి చాటలో బియ్యం పోసుకొచ్చింది. దామోదరం సంచి పట్టాడు. సంచిలోపోసింది.)

దా:- ఈ కంఠంలో ప్రాణముండగా మరొకళ్ళని ధనవంతుడి నయినా సరే - అడగటం యిష్టంలేదు. అందుకే నీ దగ్గరకొచ్చా. (లక్ష్మి అక్కడేనిల్చుంది. లక్ష్మి వంక చూస్తూ) ఏం లక్ష్మీ మరి పప్పన్నం యెప్పుడు పెడతావ్ (సిగ్గుతో చరచరా లోపలికి పోయింది.) భగవదార్పణం మరివస్తా ప్రొద్దుపోయింది.

ధర్మ:- అలాగే (దామోదరం వెళ్ళిపోయాడు. ధర్మయ్య రెండుసార్లు పచారుచేసి) అమ్మాయి లక్ష్మీ యేం చే స్తున్నావమ్మా ?

లక్ష్మి:- ఆఁ (లోపల్నుంచి) వస్తున్నా నాన్నా. లాంతరు వెలి గిస్తున్నా. (ఒక్కక్షణం ఆగి వచ్చింది)

లక్ష్మి:- ఏమిటినాన్నా ?

ధర్మ:- లాంతరు బయట అలుముకున్న చీకటినే మాపివేస్తుం దమ్మా. కానీ కలతలతో హృదయంలో అలుముకున్న చీకటిని ఆర్పివేయలేదమ్మా.

లక్ష్మి:- ఏమిటినాన్నా అది ?

ధర్మ:- అర్థంకాని పసితనం. అల్లారుముద్దుగా పెరిగావు. ఆట పాటలతోనే కాలంగడిపావు. గాఢాంచేత నిన్నేమి అన లేక పోయాను.

లక్ష్మి:- అంటే ?

ధర్మ:- నామాటలు నీ కర్థంకావమ్మా. అన్యం పుణ్యం యెరు

గని మనసునీది. కానీ ఆడపుటక అదృష్టహీనమైయుం దమ్మా.

లక్ష్మి:- నీవు వట్టి పిచ్చివాడివినాన్నా. కొండంతనాన్న అండ వుండగా, నాకేంకొరత. అదృష్టహీనురాలను నేనెలా అవుతాను.

ధర్మ:- పిచ్చితల్లి నల్లనివన్నీ నీళ్ళు తెల్లనివన్నీ పాలు అను అనుకుంటావు. ప్రపంచంపోకడ నీకర్థంకాదు.

లక్ష్మి:- ఏమిటినాన్నా ? వింతగా మాట్లాడుతున్నావు. యీ రోజు –

ధర్మ:- అరవై యేళ్ళ అనుభవంలో వృద్ధాప్యంతో కాటికి సిద్ధంగా ఉన్నాను. ఆశలన్నీ ఆరిపోయినా, దరిద్రుడి నయినా హృదయమిచ్చిన నీ తల్లి వీడిపోయినా బంధు వులూ, సంఘం విడనాడినా లోకంలో ఏకాకినయి నాజీవితమంతా చీకటిగా మారిపోయినా, నిన్ను నా ఆశాజ్యోతిని చిట్టితల్లిని చూసుకొని యింకాబ్రతికే వున్నానమ్మా. నిరాశా నిస్పృహాలు పీఠం వేసుకున్న నాహృదయంలో అణగారిన ఆశలను ఉజ్వలింప చేశా వమ్మా.

లక్ష్మి:- ఊర్కో నాన్నా ! అలామాట్లాడకు. నాకేదో భయ మేస్తోంది.

ధర్మ:- ప్రశాంతంగా సాగిపోయే మనబ్రతుకులో మరోతుఫాను

రేగబోతోంది. ఈ మాటలకే భయంవేస్తే భయంకర మయిన యీ ప్రపంచం చేయబోయే ఆగడాలకు యింక యేం నిలవగల్గుతావు.

లక్ష్మి:- ఇంక ఊర్కో నాన్నా.

ధర్మ:- ఊరుకుందామనే అనుకున్నా — కానీ పరిస్థితులు ఊరుకోనిస్తేనా ?

లక్ష్మి:- అదిగో మళ్ళీ.

ధర్మ:- చెప్పనీయ్ తల్లీ — ఈ విశాలప్రపంచంలో నాకు మిగిలిందల్లా నీవు ఒక్కతెవే. కాలు క్రిందపెడితే కందిపోతావేమోనని ప్రాణమొక మెత్తగా ఈహృదయంలో పెట్టుకొని పెంచాను. తండ్రిమాట జవదాటకుండా తగిన కూతురువయ్యావు. కానీ కాలం మనకోసం ఆగదు లక్ష్మి — జవసత్వాలుడిగి పోయినై. నేను పెద్దవాడినయి పోయాను. పండి మగ్గినపండు త్వరలోనే రాలక తప్పదమ్మా

లక్ష్మి:- నాన్నా !

ధర్మ:- తండ్రి హృదయంలో ప్రేమనే యెరుగున్నావు. కానీ ఆ వేదన అర్థంకాదమ్మా. దారిద్ర్యంతో భార్యా వియోగంతో సంక్షుభితమై శోచికత్వంతో సగంచచ్చిన ముసలివాడిని మరింత బాధపెట్టకు లక్ష్మి.

లక్ష్మి:- నీకు బాధకలిగించే తప్పు నేనేంచేశాను నాన్నా ?

ధర్మ:- నీవు చేయకపోయినా లోకం తప్పు పడుతుందమ్మా.

లక్ష్మి:- నామనస్సు నీకు తెలియదా నాన్నా ?

ధర్మ:- నాకు తెలియటం ముఖ్యంకాదమ్మా - సమాజమనే న్యాయస్థానం నీబోటి వాళ్ళని బోనులోకి యెక్కించి, చేయని తప్పులను ఒప్పిస్తుంది.

లక్ష్మి:- నీమాటకు వ్యతిరేకం నేనేంచేశాను నాన్నా ?

ధర్మ:- చేయలేదు. ఇకముందు చేయబోనని మాటయివ్వు లక్ష్మి.

లక్ష్మి:- నాతండ్రికి నేనెప్పుడూ ద్రోహంచేయను. నీవుచెప్పి నట్లే వింటాను నాన్నా.

ధర్మ:- ఒక్కమాట గుర్తుంచుకో లక్ష్మి నీ పదిహేడేళ్ళ జీవితంలో తండ్రిగా ప్రేమించగలిగానే కాని యెన్నడూ శాసించలేదు. నాతల్లిని శాసించగల ధైర్యం నాలో యిప్పుడుకూడా లేదు. లక్ష్మి యీరోజు నిన్ను ఒక్క వరం అడుగుతున్నాను.

లక్ష్మి:- వరమా ?

ధర్మ:- అంతేకాదు - త్యాగంకూడా. నీవు రామంతో తిరగ్గూడదు. అతనితో మాట్లాడకూడదు. వాళ్ళ యింటివైపయినా చూడకూడదు. యికనుంచి తోటలో అడుగు పెట్టకూడదు.

లక్ష్మి:— (హడిలిపోయి) నాన్నా — ఏమిటి నీవనేది!

ధర్మ:— నీకు బాధ కలిగించేమాట వాస్తవమే. అయినా తప్పదు. మనం దరిద్రానికి దాసులం — సంఘానికి బానిసలం. సౌఖ్యాలకు వారసులం కాదమ్మా. మనసులూ మమతలూ ప్రేమలూ మనకోసం కాదు. డబ్బుగల వాళ్ళకే.

లక్ష్మి:— బావనూ నన్నూ దూరంచేస్తున్నారా నాన్నా.

ధర్మ:— ఊరోకో లక్ష్మి.

లక్ష్మి:— తండ్రివై గారాబంగా పెంచావే — దేవుడిలా రక్షించావే ఇప్పుడు నా బావకు దూరం చేస్తారానన్ను ?

ధర్మ:— లక్ష్మి !

లక్ష్మి:— మమ్మల్ని వేరుచేయకండి నాజీవితంలో మిమ్మల్ని కోరేది యిది ఒక్కటే ? బావా నేనూ జంటగా పెరిగాం. జంటగా ఆడుకున్నాం. మాజంటను వేరుచేసి మాహృదయాల్లో నిప్పులు కృమ్మరిస్తారా చెప్పండినాన్నా

ధర్మ:— తనకూతురు సుఖానికి యే తండ్రీ అడ్డురాడమ్మా.

లక్ష్మి:— అయితే బావకూ నాకూ మధ్య యీ అగాధాలు కల్పిస్తున్నా రెందుకు.

ధర్మ:— ఆ పాపాన్ని నాకంటగట్టకు లక్ష్మి.

లక్ష్మి:— మరెవరు ?

ధర్మ:- రామం.

లక్ష్మి:-అబద్ధ - బావయెప్పటికీ అనడు. బావనన్ను విడిచి ఒక్కక్షణంకూడా వుండలేడు. అబద్ధాలతో నన్ను వంచించటం దేనికినాన్నా.

ధర్మ:- వంచన కాదమ్మా. దరిద్రులకూ ధనవంతులకూ సంబంధాలు సాధ్యంకావు లక్ష్మి.

లక్ష్మి:- ఎందుకని? బావయెప్పుడయినా యీ అంతరాలు చెప్పేవాడా? అంతరాలే యెంచితే యీ దరిద్రలక్ష్మినే తనెందుకు ప్రేమిస్తాడు. పెళ్ళిచేసుకుంటానని మాట యెందుకిస్తాడు.

ధర్మ:- నీకు లోకానుభవం తక్కువలక్ష్మి. మీకు వియోగాలు కల్పించి మీ ప్రేమను నాశనం చేయటం, నా ఆంతర్యం కాదమ్మా.

లక్ష్మి:- మరి?

ధర్మ:- రామం తండ్రిచాటు బిడ్డ. తండ్రిమాట కాదనకలిగే ధైర్యం అతనిలో లేదు. అతనిహృదయములో స్థానముండినా నారాయణరావు ధనపిపాసి. యీ పెళ్ళికి ఒప్పుకోడు.

లక్ష్మి:- బావ ఆడినమాట తప్పడు నాన్నా. నన్ను అన్యాయం చేసి తను ఆత్మవంచన చేసుకోడు. అన్యాయానికి తల

వంచడు. బావ –

ధర్మ:– కానీ నారాయణరావు తన బొందిలో ప్రాణముండగా యీ వివాహము జరగటానికి వీల్లేదని ఖండితంగా చెప్పేశాడు.

లక్ష్మి:- నిజంగానా?

ధర్మ:– చేయవలసిన ప్రయత్నమంతా చేశాను. కానీ ప్రయోజనం లేకపోయింది.

లక్ష్మి:– అయితే ఇంక చెయ్యగలిగే దేమీ లేదా నాన్నా?

ధర్మ:– పిచ్చిదానా, ఆశలు నెరవేరటం సామాన్య విషయం కాదు. ఈ విశాల ప్రపంచంలో, రామం – లక్ష్మి ఇద్దరే వుంటే ఫరవాలేదు. బంధువులు, సంఘం పరువూ ప్రతిష్ఠా కీర్తి—ఇంకా ఎన్నో వున్నాయి. వీటి నన్నిటిని అధిగమించటం చాలాకష్టం.

లక్ష్మి:– అయితే వీటికోసం మా ప్రేమను బలిచేయవలసిన దేనా?

ధర్మ:– గత్యంతరము లేదు. రామం ధర్మయ్య కూతుర్నే కావాలనుకుంటే తండ్రిని వదులుకోవలసిందే. తండ్రిని వదులుకుంటే రామం దరిద్రుడు కాక తప్పదు. బంధువులకూ, సంఘానికీ కూడా వ్యతిరేకి కావాలి. అప్పుడు దరిద్రదేవత మీ ప్రేమనే బలిగొంటుంది. మీ జీవితాల్లో యిక మిగిలేవి దుఃఖమూ, వైరాగ్యం

తప్ప యింకేమి కావు. నీవ్వా, నామం సౌఖ్యానికి దూరమయి. బాధలతో క్రుంగిపోనఁ సి వస్తుంది. మీ అనురాగమూ, ప్రేమా విద్వేషం విరక్తిగా మారి పోతాయి. బ్రతకటమే హేయమనిపిస్తుంది, జీవితం బాధల బరువులలో భారమయి పోతుంది. కలలు కల్ల లయి ఆశించిన స్వర్గసౌఖ్యాలు క్షణంలో నరకమయి హేయంగా నవ్వుతూ ఎదుటనిల్చుని తాండవం చేస్తాయి. మీ ప్రేమ యీవిధంగా మారిపోవటం మెవరికి శ్రేయస్కరం. ప్రేమించుకున్న మీకా - మీ సౌఖ్యాన్ని చూచి, ఆనందిద్దా మనుకున్న యీ ముసలి తండ్రికా - చెప్పుతల్లీ. బాగా ఆలోచించు. ఇది ఆలోచనకు సమయం కానీ ఆవేదనకు కాదమ్మా.

లక్ష్మి:- ఇంకా ఆలోచించేదేముంది నాన్నా. సుఖస్వప్నాలు పీడకలలుగా మారిపోతుంటే - బలహీనులమయిన మనమేం చేయగలం. చేయగలిగేదీ, చేసేదీ అనుభ వించటం తప్ప. బావకోసం- బావ సౌఖ్యంకోసం యేం భరించమన్నా భరిస్తాను. బావ పదికాలాల పాటు సుఖంగా వుండేచాలు.

ధర్మ:- లక్ష్మీ నీవు త్యాగమూర్తివమ్మా.

లక్ష్మి:- (ఏడుస్తుంది Pause )

ధర్మ:- జరిగిందేదో జరిగిపోయింది. అన్నీమరచిపో లక్ష్మీ.

మనకు తగ్గసంబంధమే చూస్తాను. పెళ్ళిచేసుకుని నా కళ్ళముందు సుఖంగా వుంటేచాలు. ఇక నా జీవితంలో ఆశించే దేముంది.

లక్ష్మి:- నాన్నా - నాహృదయం బావకు అంకితమయి పోయింది. ఈజీవితం యిలాగడచిపోనీ మళ్ళీ ఆ హేయమైన లోకంలోకి నన్ను విసరివేయకండి.

ధర్మ:- లక్ష్మీ -

లక్ష్మి:- పదండి నాన్నా వెళ్ళిపోదాం. యీ వూరు విడిచి యెక్కడకయినా వెళ్ళిపోదాం. ఇక్కడేవుంటే బావను చూసుకుంటూ వుండలేను. ఆతోటచూచినా, ఆయిల్లుచూచినా, మరిచిన స్మృతులే గుర్తుకువచ్చి మనసును కలతపెడతాయి. పదండినాన్నా యీవూరు విడిచి, యెక్కడికయినా వెళ్ళిపోదాం.

ధర్మ:- వెళదాం - కానీ యింతరాత్రప్పుడు యెలావెళ్ళగలం. తెల్లవారనీ వెళ్ళిపోదాం. సరేనా ?

లక్ష్మి:- సరే.

ధర్మ:- లేనిపోని ఆలోచనలతో మనస్సును కలతపెట్టుకోకు. కలకాలం కష్టాలే కాపురం చేస్తాయా. యీచీకటే ఎల్లప్పుడూ వుంటుందా - తెల్లవారితే వెలుగురాదూ. కన్నీళ్ళు తుడుచుకో వెళ్ళమ్మా. యింట్లోపనిచూడు. నేనలా బయటకు వెళ్ళొస్తా. (ధర్మయ్య కనులు

తుడుచుకుంటూ బయటకు వెళ్ళిపోయాడు. లక్ష్మికి ఆపుకున్న దుఃఖం పొంగిపొర్లింది. నోట్లో చెంగుపెట్టుకుని బావురుమంది.)

లక్ష్మి:- అమ్మా నన్నెందుకు కన్నావమ్మా. యీకష్టాలుపడేందుకేనా. మనసున్న మనిషిగా సృష్టించి, మనసులేని ప్రతిమగా బ్రతకమన్నావా అమ్మా. నా గురించి నాన్నకు యింకా కష్టాలు పెడుతున్నావా. (ఫొటో ముందు ఏడుస్తుంది. ఇంతలో రాము ప్రవేశించాడు. జుట్టు చెదరివున్నది.)

రా:- లక్ష్మి ?

లక్ష్మి:- యెవరూ, బావా.

రా:- లక్ష్మి నేనే.

లక్ష్మి:- బావా -

రా:- ఛీ - ఊర్కో. తప్పుకదూ ?

లక్ష్మి:- వెళ్ళిపో బావా. ఇక యిక్కడికి యెప్పుడూ రాకు.

రా:- లక్ష్మి ?

లక్ష్మి:- రేపటినుంచీ నీకు దూరమయి పోతున్నాను. నన్నిక మర్చిపో బావా.

రా:- ఆఁ వెళ్లిపోతున్నావా. ఎక్కడకీ ఎందుకు.

లక్ష్మి:- ఎక్కడికెళతామో మాకే తెలియదు. మాకు కాని

యీసంఘాన్ని, బంధువులనూ విడిచి యెక్కడికో దూరంగా వెళ్ళిపోతున్నాం.

రా:- ఏమిటీ! నీవు మాట్లాడేది. నీ కేమయినా మతి పోయిందా ?

లక్ష్మి:- ధనవంతుల అమ్మాయినే పెండ్లి చేసుకో. పరువూ, ప్రతిష్ఠలు యెక్కువ చేసుకో. నలుగురిలో పేరు తెచ్చుకో. గడచినవన్ని మరచిపో.

రా:- అంటే ?

లక్ష్మి:- మేం దరిద్రులం. ధనవంతుల్ని ప్రేమించటం నేరమవుతుంది. వెళ్ళు బావా ?

రా:- ఇంత అమాయకురాలవేం లక్ష్మి. రామం డబ్బు పేరుతో, సంఘం పేరుతో నిన్ను మోసగిస్తాడనుకున్నావా – పిచ్చిదానా.

లక్ష్మి:- వివాహం నూరుకాలాల పంట. మీనాన్నకూ, బంధువులకూ యిష్టంలేని వివాహం చేసుకొని యేం సుఖిస్తావు. కత్తుల బోనులో కాపురం హాయినిస్తుందా ? వద్దులే బావా.

రా:- అయితే యిష్టంలేకపోయినా, పెద్దలు చెప్పారని నా మనసును చంపుకోమంటావా ?

లక్ష్మి:- కాదు బావా ? నీ సుఖంకోసం చెప్తున్నా. నాకోసం

నీవు లోకానికి పగ కావటం దేనికి. మీనాన్న చెప్పిన ప్రకారం పెళ్ళిచేసుకొని సుఖించు.

రా:- సుఖం - డబ్బుకోసం, సంఘంకోసంప రువు, ప్రతిష్ఠల కోసం నాన్నకోసం నాప్రేమను బలిచేసుకుంటే సుఖ పడతాననుకున్నావా. నా అంతరాత్మను చంపుకొని, నాప్రాణానికి ప్రాణమయిన నిన్ను వదలుకుని సుఖపడతా ననుకున్నావా? వెర్రి మొర్రి వూహాలతో నామనస్సెం దుకు పాడుచేస్తావు లక్ష్మి.

లక్ష్మి:- కానీ మనయిద్దరి మధ్యా దరిద్రం అనే అగాధంవుంది. మేం భాగ్యవంతులం కాలేం. మరి దరిద్రులతో వియ్యమందనూ లేరు.

రా:- మనప్రేమను దరిద్రమేకాదు, యేవీ ఆపలేవు. నీవు నా నీడనుంటేచాలు. ప్రపంచాన్నయినా, వ్యతిరేకించ గల ఆత్మబలం వస్తుందినాకు.

లక్ష్మి:- అయితే నాకోసం, వీటినన్నింటిని వదలుకుంటావా?

రా:- వదలుకున్నాను. నాలక్ష్మికోసం ఏమయినా చేస్తాను. మీరు భాగ్యవంతులు కాలేరు. అందుకని నేను దరి ద్రుడి నయ్యాను. ఇప్పుడు మనమధ్య యింక అంతరా లేమున్నాయి.

లక్ష్మి:- ఏమిటిబావా! అంటే?

రా:- నాన్న నినో్న, ఆస్తినో యెవరినో ఒకరినే కోరుకోమ

న్నాడు. మనసారా కోరుకున్నా - నాలక్ష్మిని.

లక్ష్మి:- నాకోసం నీతండ్రినీ ఆస్తినీ త్యాగంచేశావా? ఎంత పని చేశావుబావా! ఆలోచించకుండా.

రా:- ఆలోచించటానికి యిందులో యేముందని.

లక్ష్మి:- నీవు చిన్నప్పటినుంచీ గారాబంగా పెరిగావు. కష్టాలెరుగని జీవితంనీది. కష్టాలతో బాధపడటానికి, నాకోసం నీ సర్వస్వం త్యాగంచేశావా బావా?

రా:- నాసర్వస్వం నీవే లక్ష్మీ. ఆస్తి సుఖమిస్తుందనుకున్నావా? లక్ష్మి నాపక్కనుంటేచాలు. ఎన్ని కష్టాలొచ్చినా, నవ్వుతూ ఎదుర్కొంటాను.

లక్ష్మి:- బావా?

రా:- ఇప్పుడు నామీద నమ్మకమేనా నీకు.

లక్ష్మి:-ఎప్పుడు నమ్మలేదు బావా నిన్ను

రా:- ఈరోజు మనం వెళ్ళిపోవాలి.

లక్ష్మి:-వెళ్ళిపోవాలా - ఎక్కడికి?

రా:- ఎక్కడికో -

లక్ష్మి:-అంటే?

రా:- రెక్కలుకట్టుకుని యెగిరిపోవాలి. యీ కత్తులబోనునించి, తప్పించుకుని స్వేచ్ఛగా స్వేచ్ఛా ప్రపంచంలోకి వెళ్ళిపోవాలి. కలిమిలేములు లేనిచోటికి, కష్టాలు రాని

చోటికీ, కలకాలం సుఖించేచోటికి వెళ్ళిపోవాలి. సంఘం కట్టుబాట్లూ పరువుప్రతిష్ఠల, సంకెళ్ళు పిదిలించుకొని నాకు నీవయి - నీకునేనయి యీసంఘానికి దూరంగా వెళ్ళిపోవాలి లక్ష్మీ ఈరోజే - ఈరోజే వెళ్ళిపోవాలి - రహస్యంగా.

లక్ష్మి:- బావా!

రా:- అడ్డుమాటలు చెప్పకులక్ష్మీ. యీనాడు మనమిద్దరం స్వేచ్ఛాజీవులం. ఈరోజు మన జీవితాల్లో, ఒక క్రొత్త ప్రకరణం.

లక్ష్మి:- ఏమిటిబావా! వెర్రిగా -

రా:- వెర్రికాదులక్ష్మీ. యీవూళ్ళో యికవుండలేం. వెళ్ళిపోదాం. యీ రాత్రికే వెళ్ళిపోదాం.

లక్ష్మి:- మరి నాన్నో?

రా:- నీవు త్యాగంచేసుకోవాలి.

లక్ష్మి:- ఏమిటీ! అర్థంలేనిమాట. నాన్నను విడిచిపెట్టి మనమిద్దరం వెళ్ళిపోతే, నాన్న యేమయి పోతాడు. లోకం యేమనుకుంటుంది?

రా:- ఇంక లోకం యేమనుకుంటే మనకేం. దానితో తెగతెంపులు చేసుకుంటున్నప్పుడు.

లక్ష్మి:- ఆలోచించి మాట్లాడుబావా! ఈనాడు సంఘంపై

కసితో, మనమిద్దరం వెళ్ళిపోతాం. ఈలోకం అపనింద వేసినా, లెఖ్ఖ చేయకుండా ఎంతో దూరానుంటాం. ఇంతవరకూ, అల్లారుముద్దుగా పెంచిన ముసలినాన్నను విడిచి రమ్మంటున్నావా ? ఉద్రేకంలో విచక్షణా జ్ఞానానికే దూరమయి పోతున్నాం బావా.

రా:- ఆలోచించానులక్ష్మి. ఆయన వృద్ధుడు, మనకు యిద్దరికీ యెన్ని కష్టాలయినా అనుభవించగల శక్తివుంది. పైగా, యిలా వెళ్ళిపోనటం తెలిస్తే, మీనాన్న ఒప్పుకోడు. మళ్ళా సంఘమనీ, వంశకీర్తులనీ చెప్పి మన ప్రేమను నాశనంచేస్తారు. మన జీవితాంతంవరకూ వియోగాన్ని కల్పిస్తారు. మంగళతోరణాలకు బదులుగా ఉచ్చులుపన్ని మన మెడలలో ఉరితాళ్ళు వేస్తారు. మనకోసం యీ ఒక్క త్యాగాన్ని చేయలేవా ?

లక్ష్మి:- నన్ను మరింతా అయోమయంలో పడవేస్తున్నావు బావా. నన్ను ఆలోచించుకోనివ్వండి.

రా:- కాదులక్ష్మి - అన్నీ ఆలోచించే నేను యీనిర్ణయానికి వచ్చాను. మనకున్నది రెండే రెండుమార్గాలు. ఇలా లోకానికి దూరంగా వెళ్ళిపోయి సుఖంగా బ్రతకటమో లేక, పరువుప్రతిష్ఠలకు వెరచి జీవితాంతం వియోగంతో కుమిలిపోవడమో ?

లక్ష్మి:- నన్నే ప్రాణసమానంగా యెంచే నాన్నకు అన్యాయం చేయలేను బావా.

రా:- అయితే విన్నా, నీ ప్రేమనూ నమ్ముకుని తండ్రి నీ ఆస్తినీ కాలదన్నుకుని - నీకోసం లోకానికి శత్రువనయిన నాకుమాత్రం అన్యాయం చేయగలవ్. కానీ యీమాత్రం త్యాగం చేయలేవు.

లక్ష్మి:- నీకు అన్యాయం చేయటం నాఉద్దేశ్యంకాదు బావా. నీకోసం నాప్రాణాన్నయినా సంతోషంగా యివ్వగలను. కానీ -

రా:- కానీ నేచెప్పేది మాత్రం వినవ్.

లక్ష్మి:- నాది ఆడబ్రతుకు - నిజం గ్రహించకుండా -

రా:- అన్నీ గ్రహించా. ఆవేశంలో నీవు నాకోర్కె నెరవేరుస్తావనీ, కష్టాలలో భాగం పంచుకుంటావనీ నమ్మి, మోసపోయా. సరే వస్తాను.

లక్ష్మి:- బావా-

రా:- ఇంకా యెందుకు నన్నాపుతావ్, రానన్నావుగా.

లక్ష్మి:- కాదుబావా - నాకు నాన్నా కావాలి, నీవూకావాలి నేను యెవరిని వదులుకోను. నేను అబలను నన్నేం చేయమన్నావ్.

రా:- ఏదో ఒక నిర్ణయానికి రావటమే.

లక్ష్మి:- తప్పదా ?

రా:- అంతే.

"Lakshmi's ellusion"

(**Lights off and on** స్టేజి వెనుకనించి పాగలాగు క్రమ్మిన్నుంది. **Stage** పై లక్ష్మి ఒక్కతేవుంది. ఎడమప్రక్కనుంచి ధర్మయ్య ప్రవేశించాడు.)

లక్ష్మి:- నాన్నా -

ధర్మ:- లక్ష్మి నన్నువిడిచి వెళ్ళిపోతున్నావా ? చిన్నప్పటి నుంచీ తల్లినీ, తండ్రినీ నేనేఅయి కాలుక్రింద పెడితే కందిపోతావేమోనని, పువ్వుల్లో పెట్టి పెంచానే - కంటికి రెప్పలా కాపాడానే. ప్రాణమొక యెత్తుగా చూచుకున్నానే, చివరకి కన్నతండ్రికే అన్యాయం చేస్తావా ? నన్ను అపనిందలకు గురిచేసి మన వంశానికి మాయని మచ్చ తెస్తావా. నాబ్రతుకు నవ్వులపాలు చేస్తావా- లక్ష్మి.

లక్ష్మి:- నాన్నా - నిన్ను విడిచి వెళ్ళను నాన్నా. నిన్ను అపనిందలకు గురిచేయను. మనవంశాన్ని కళంకం చేయను. బావనే వదులుకుంటాను. నాప్రేమనే వదులుకుంటాను. (తండ్రివేపు రెండడుగులు వేసింది. కుడివైపునుంచి రామం ప్రవేశించాడు.)

రా:- లక్ష్మి - (ఆగిపోయింది.)

లక్ష్మి:- బావా !

రా:- ఇదా నీప్రేమ. నీకోసం బంధువులనూ, సంఘాన్నీ డబ్బునూ అందరినీ వదులుకొన్నాను. నీకోసం దరిద్రాన్ని నవ్వుతూ స్వీకరించాను. కడకు కన్నతండ్రినే త్యాగం చేశాను. నా ప్రేమకూ నాత్యాగానికీ యిదా నీవు చూపించే కృతజ్ఞత ?

లక్ష్మి:- బావా !

రా:- అయితే బావచెప్పినమాటే సత్యం. నాఆస్తికోసం యింతవరకూ నన్ను ప్రేమిస్తున్నట్లు నటించావన్న మాట. ఇప్పుడు దరిద్రుడయినా నని, తృణీకరిస్తున్నా నన్నమాట.

లక్ష్మి:- కాదుబావా !

రా:- మరి ?

లక్ష్మి:- నాన్నను ఎలావదులుకోను.

రా:- నీకోసం నీ ప్రేమకోసం నా కన్న తండ్రిని వదులుకో లేదూ ? మరి నాకోసం నా ప్రేమకోసం నీతండ్రిని వదలుకో లేవేం - ఇదేనా నీప్రేమ.

లక్ష్మి:- బావా (రామంవైపుకు రెండడుగులు వేసింది.)

ధర్మ:- లక్ష్మి - (అరిచాడు బాధతో)

లక్ష్మి:- నాన్నా ... నాన్నా ... క్షమించు - (రామం మీాద వాలి పోయింది.)

(Lights off and on పొగలాగు క్రమ్మి విడిచిపోయింది. మళ్ళీ వెనకటి లాగే స్టేజీమీద రాము, లక్ష్మి యిద్దరే మిగిలారు. రామంచేతుల్లో లక్ష్మివుంది.)

రా:- ఎందుకిలా బాధపడతావు లక్ష్మీ. గుండెను రాయి చేసుకో. ఆపదలు మానవులకుకాక మానులకొస్తాయా

లక్ష్మి:- గుండెను రాయిచేసుకుంటాను బావా. వస్తాను... నీవెంటే వస్తాను. నాన్ననే వదలుకుంటాను - (నిశ్చల ప్రతిమలా మాట్లాడింది.)

రా:- లక్ష్మీ జన్మజన్మాలకు నీ ఋణం తీర్చుకోలేను. నీవు త్యాగమూర్తివి. (చేతులు పట్టుకున్నాడు.)



# సందేశం

## (తృతీయ దృశ్యము)

## [20 ఏళ్ళ తర్వాత]

రామంయిల్లు. పెద్దమేడ మంచికుర్చీలు, చక్కని సోఫా లున్నాయి. వివేకానందుడు, గౌతమబుద్ధుడు, మహాత్మగాంధి గార్ల ఫొటోలున్నాయి. రామం లోపలినుంచి stage మీాదకి చేయితుడుచుకుంటూ వచ్చాడు. వెనకనే లక్ష్మికూడావచ్చింది. రామానికి యిప్పుడు 45 సం॥లు. లక్ష్మికి 35 ప్రాయితం వారి ముఖాలు చాలా ఉల్లాసంగా కనపిస్తున్నాయి.

రా:- (సోఫాలో కూర్చుని) లక్ష్మి -

లక్ష్మి:- (లక్ష్మి తివాచీపై కూర్చుంది.) ఊ తీసుకోండి (ఆకులు అందిస్తోంది.)

రా:- ఏమిటీ పరిచర్యలు. నీఆరోగ్యం యేమంత మంచిది కాదు. ఎప్పుడూ, ఏదోఒకటి చేస్తూనే వుంటావు. (Pause) మనగోపీ యెక్కడికి వెళ్ళాడు.

లక్ష్మి:- బడికి వెళ్ళేడు.

రా:- వాడికి పరీక్షలు దగ్గరకొచ్చాయి కదూ. బాగాచదువు కుంటున్నాడా ?

లక్ష్మి:- ఏంచదువో, యేమో బడిలో ఏపనొచ్చినా, వీడిదే

నాయకత్వ మయిపోయింది.

రా:— మరి నీ కొడుక్కాదు.

లక్ష్మి:— అవున్లే. మీచిన్నతనంలో మీరు మాత్రం తక్కువా?
అచ్చంగా అబ్బబుద్దే అబ్బింది వాడికికూడాను.

రా:— నీబుద్ధిగాలా ?

లక్ష్మి:— చాల్లెండి.

రా:— ఆవు పొలాన మేస్తుంటే, దూడ గట్టున మేస్తుందా ? నీ మంచిబుద్దే వాడికీ అబ్బింది. వాడిహృదయం చాలా సుకుమార మయింది. త్యాగ్యం వాడికి ప్రగ్గుపాలతోనే నేర్పావు. వాడూ, ఒక దేశభక్తుడై దేశానికి యింత సేవ చేయగలిగితే యింక మనక్కావలసిం దేముంది. (Pause) మన జీవితాలు యెంతగా మారిపోయాయి లక్ష్మి – నాన్నను విడిచిపెట్టి 20 సంవత్సరాలయింది. అబ్బ 20 సంవత్సరాలు. మళ్ళీ యివ్వాళ కలుసుకో బోతున్నాం. నాన్నని–కానీ. . .20 యేళ్ళు 20 రోజుల్లా గడపాం ఎన్ని కష్టాలొచ్చినా, యెదుర్కొన్నాం. అదృష్ట హీనురాలవనీ, నిన్నందరూ ఒకప్పుడు ఆడిపోసే వాళ్ళు. కానీ నీ అదృష్టం కొద్దీ యీనాడు, మనం యే కొరతా లేకుండా వున్నాం. నీ సహచర్యాలూ, పరిచర్యలూ లేకుంటే, దారం తెగిన గాలిపటంలా నే నేమయి పోయేవాడినో – నీ ఋణం తీర్చుకోలేను లక్ష్మి.

లక్ష్మి:- ఏమిటండీ యీమాటలు ? మీరూ, గోపీ సుఖంగా వుంటేచాలు. ఇంకనాక్కావలసిందేముంది. ఈ పసుపు కుంకుమతో హాయిగా, మీపాదాలపై ప్రాణాలు విడిస్తే . . .

రా:- నీవెప్పుడయినా, యిలా మాట్లాడితే నాకోపమొస్తుంది.

లక్ష్మి:- (చిరు నవ్వుతో) ఇకఅనను లెండి.

రా:- చేతిలో చేయివెయ్యి.

లక్ష్మి:- ఏం నమ్మకం లేదా ?

రా:- లక్ష్మీ - (దగ్గరకు తీసుకున్నాడు. గంటకొట్టింది.)

లక్ష్మి:- అరే! ఒంటిగంటయింది. ఇంకా ఇక్కడే వున్నారే. మామయ్య వచ్చేవేళయింది.

రా:- అరే - చెన్నయ్య బండిదగ్గరకు వెళ్ళాడుకదూ.

లక్ష్మి:- ఒట్టి మతిమరుపు మనుషులయి పోతున్నారు.

రా:- కారణం యేమిటంటావు ?

లక్ష్మి:- సరేలెండి - నాకేం తెలుసు.

రా:- లక్ష్మి ప్రక్కన వున్నంతసేపూ నన్ను నేనే మరచిపోతాను. యిక యితరుల సంగతి చెప్పాలా ?

లక్ష్మి:-చాల్లెండి. పెద్దవారయినా యింకా చిలిపితసంపోలా. (వెళ్ళబోయింది. రామం కొంగుపట్టుకున్నాడు.) మీరు

ఉండే కొద్ది మరీ చిన్నవాళ్ళయి పోతున్నారు. బండి టయిమయింది.

రా:- ఓ - మరలా

లక్ష్మి:-మతిలేక పోతేసరి.

రా:- అలా తయారు చేశారు తమరు.

లక్ష్మి:-అన్నిటికీ యిదొకపల్లవి. (వంకినున్న కోటు అందించింది.)

రా:- ఉన్నమాటంటే ఉలుకు జాస్తి. (కోటు వేసుకున్నాడు.)

లక్ష్మి:- ఊం కూర్చోండి.

రా:- ఆజ్ఞ (బూట్లు తొడిగింది.) లక్ష్మి యివన్నీ యెవరు నేర్పారు.

లక్ష్మి:- మీరు - మీ - (ఏదో చెప్పబోయి నవ్వింది.)

రా:- ఆగావేం - వస్తా.

లక్ష్మి:- తలదువ్వుకోకుండానే -

రా:- తీసుకురా, ఆబాకీ తీర్చేస్తాను.

లక్ష్మి:- చిత్తం (అద్దము దువ్వెనా అందించింది.)

రా:- (తలదువ్వుకొని) యిక శలవా ?

లక్ష్మి:- త్వరగా వస్తారుకదూ.

రా:- బండి Late కాకపోతే. (బయిటికి బయలుదేరి చూచి లోపలకు వెళుతున్న లక్ష్మిని ఆపి ఉత్సాహంతో)

లక్ష్మి నాన్నగారు వచ్చేశారు. (లక్ష్మి ఆనందంతో చూచింది. ఇంతలో చెన్నయ్య, నారాయణరావు గారు వచ్చారు. నారాయణరావుగారికి 75 ఏళ్ళు.)

లక్ష్మి:- చెన్నయ్యా! సామాన్లు లోపలికి తీసుకువెళ్ళు. (చెన్నయ్య పెట్టె, బెడ్డింగు లోపలికి తీసుకెళ్ళాడు.)

రా:- నాన్నా!

నారా:- రామం - (ఇద్దరూ కౌగలించుకొన్నారు.)

లక్ష్మి:- మామయ్యా - (కాళ్ళకు నమస్కరించింది.)

నారా:- లక్ష్మి - లేతల్లీ!

రా:- ఊళ్ళో మనవాళ్ళంతా కులాసానాన్నా.

నారా:- ఆఁ వాళ్ళకేం - ఆ కాకి మూకను తప్పించుకొచ్చేసరికి, మరోజన్మ యెత్తినట్లయింది. (ఇంతలో లక్ష్మి లోపలికి వెళ్ళి మళ్ళీ నీళ్ళు తెచ్చింది.)

లక్ష్మి:- కాళ్ళు కడుక్కోండి, మామయ్యా. (లోపలవైపుకు తిరిగి) చెన్నయ్యా!

చెన్న:- (లోపల్నుంచి) అమ్మా...

లక్ష్మి:- పెదబాబుగారికి, నీళ్ళు తోడు. కాళ్ళుకడుక్కోండి మామయ్యా. స్నానంచేసి భోంచేద్దురు కాని.

నారా:- అన్నానికేంలే అమ్మా. 20 యేళ్ళయిందీ, మిమ్మల్ని చూసి. ఒక్కసారి, నాకళ్ళు కరువుదీరా చూసుకోనీ.

నాకొడుకునీ, కోడల్నీ. అరె మనుమడేడీ - ఏమిటో మరిచిపోయాననుకుంటున్నా. ఎక్కడికి వెళ్లాడు.

రా:- School కెళ్లాడునాన్నా.

నారా:- ఏంచదువు తున్నాడు.

రా:- S. S. L. C.

నారా:- అబ్బో. S. S. L. C. యే - 16 ఏళ్లుంటాయా? వస్తూ వాడిని గురించే ఆలోచన. తాతయ్యా తాతయ్యా అంటూ యెప్పుడు దగ్గరకు వస్తాడా అని - వాడిని నా వడిలోకి యెప్పుడు తీసుకుంటానా అని. ఇంకా ఎంతసే పటికి వస్తాడు. స్కూలు దగ్గరా ? దూరమా? చాలా ఎండగా వుందే.

రా:- దగ్గరేలే నాన్నా. వచ్చే వేళయింది.

(ఇంతలో గోపీ బయటనుంచి పరుగెత్తుకుంటూ వచ్చాడు.)

గోపీ:- అమ్మా - (ఏదో చెప్పబోయి నారాయణరావుగార్ని చూసి ఆగాడు.)

లక్ష్మి:- గోపీ మీ తాతయ్యరా.

నారా:- రాబాబూ (కౌగలించుకుని వడిలోకి తీసుకొని ముద్దు పెట్టుకున్నాడు. రామం లక్ష్మి ఒకరి నొకరు చూసుకుని ఆనందంతో మెల్లగా నవ్వుకున్నారు.)

నారా:- 20 యేళ్లు 20 యుగాల్లా గడిచాయి. మీరు యెక్కడ

వున్నారో తెలియదు. అహంకారంతో వెళ్ళగొట్టినా నామనస్సు బాధ పడుతూనే వుంది. ఈ జన్మలో యిక మిమ్మల్ని చూడలేనేమో ననుకున్నా. కన్నుమూసే ముందు ఒక్కసారి మిమ్మల్ని చూద్దామని ఆరాటం. నాకోర్కె చెల్లించమని, రోజూ వెయ్యి దేవుళ్ళకు మొక్కా. చివరకి నా పూజఫలించింది. దయామయుడు నాకు దారి చూపించాడు. చీకటిలోనించి వెలుగుకి జేర్చాడు. ఈ నాటికి మిమ్మల్నందరినీ చూచి సంతోషించే అదృష్టంకల్గింది. ఇప్పటికి నా మనస్సు తేలికపడింది. (కళ్ళు చెమ్మగిల్లాయి) కానీ లక్ష్మి నీకు క్షమింపరాని అపరాధం చేశాను. మీకు అనేక కష్టాలు కలిగించాను. నాకొడుకును నేను దూరం చేసుకున్నది కాక, నీ తండ్రిని నీకు దూరం చేశాను. లోకం వేసిన అపనిందకు కృంగి కృశించి పోయాడు. ఆఖరికి ఆయన కష్టాలను కడతేర్చింది మరణం. (నారాయణరావు గారి కంఠం రుద్ధమయ్యింది. లక్ష్మి కళ్ళలో నీరు తిరిగింది. గోపీ తల్లిదగ్గరకు వెళ్ళాడు. రామం వెర్రిగా లక్ష్మివైపు చూశాడు. లక్ష్మి తల ప్రక్కకు తిప్పింది.)

నారా:- ఈ పాపానికి బాధ్యుడిని నేనేలక్ష్మి. ఆ భగవంతుడు యింకా నాకు తగిన శిక్ష విధించలేదు.

లక్ష్మి:- ఊరుకోండి మామయ్యా! నారాత అలావుంటే మీరేం చేస్తారు.

చెన్న:- (లోపల్నుంచివచ్చి) బాబుగారూ! నీళ్ళు చల్లారి పోతున్నాయి.

లక్ష్మి:- పదండి మామయ్యా

రా:- పదండీ నాన్నా! ఎప్పుడు భోంచేశారో యేమో!

చె:- పదండి బాబూ! యిప్పటికే నడిజాము దాటింది. స్నానంచేసి ముందు కాస్త యెంగిలి పడండి.

గోపీ:- పద తాతయ్యా' (చెయ్యి పట్టుకొని అడిగాడు. నారాయణరావు కనులు తుడుచుకొంటూ మనుమడి చేయి పట్టుకుని బయలుదేరాడు. లక్ష్మికూడా రెండడుగులు వేసింది. వెనుకనుంచి రామం.)

రా:- లక్ష్మీ ... (లక్ష్మి దగ్గరకు వచ్చింది.) చెన్నయ్యా! నాన్నగారికి కావలసినవన్నీ చూడు. (చెన్నయ్య వెళ్ళి పోయాడు. రామం లక్ష్మిని దగ్గరకు తీసుకున్నాడు. రామం చేతుల్లో లక్ష్మి బావురుమంది.)

రా:- ఛీ – పూర్కో. తప్పుకదూ? నాన్న అసలే బాధపడుతున్నాడు. నీవే యిలా కంటతడి పెడితే, ఆయన గుండె చెరువై పోతుంది. (లక్ష్మి పైటకొంగు నోటికి అడ్డం పెట్టుకుంది.)

రా:- మనం చేయగలిందేముంది. మనం బాధ పడటంవల్ల ఆయన ఆత్మకు శాంతి కలుగదు. మనసంతోషమే ఆయనకూ సంతోషం. (కన్నీరు తుడుచుకొంది.)

నాన్నముందు బాధ పడవ్వకదూ? (అలాగేనని తల వూపింది. బయటనుంచి రామం! సేఠ్ అని కేక.)

రా:- ఎవరూ - వస్తున్నా - నాన్నగారికి భోజనం దగ్గరుండి అన్నీ చూడు. (వెళ్ళిపోయింది.)

(సేఠ్ గోవింద్‌దాస్ లోపలికి ప్రవేశిస్తూ)

గోవిం:- అబ్ మై అందర్ ఆసక్తాహుఁ? (అంటూనే లోప లికి వచ్చాడు.)

రా:- దయచేయండి.

గోవి:- జై రాంజీకి -

రా:- జై రాంజీకు-

గోవి:- ఆప్‌కా ఘర్‌కు ఎవరో బంధుల్ వచ్చినట్లుండార్.

రా:- అవును. మానాన్నగారు యిప్పుడే వచ్చారు.

గోవి:- నాన్నగార్ - అరే కభీ బోలానై ?

రా:- అవును. చెప్పలేదు.

గోవి:- అచ్ఛా అబ్ మై ఏక్ జరూర్ కాంమే ఆగయా! దాన్కి తమ సహాయం పూరా కావాలా.

రా:- ఏమిటో చెప్పండి.

గోవి:- సెప్పండి హంటే నై. జరూర్ సహాయం మాట యిస్తే, మాదీ సెప్పేదాన్కి తయ్యార్.

రా:- సాధ్యమయితే తప్పక చేస్తాను.

గోవి:- అచ్చా. అబ్ బేపార్ మే బహుత్ కసాలాగా వుండింది. బహుత్ ముష్కిల్ హోరహాహై.

రా:- డబ్బు కావాలా ?

గోవి:- కావాలా అంటేకాద్. యిది మంచి నఫాకి బేపార్ దీన్కి నమ్మి మనం పనిచేస్తే లక్ష్మి కటాచ్ఛం పూరా వుంటుంది. సో - చో.

రా:- అంటే మీ ఉద్దేశ్యం.

గోవి:- పాంచ్, దస్ హజార్సే కాం చెల్తానై. ఆప్ కా మెహర్బానీ బహుత్ జరూర్ - మాదీ Firm మే మీరు వాటా పుచ్చుకోవాలా.

రా:- (నవ్వి) అంటే నన్నుకూడా మీవ్యాపారంలోకి దిగమనా ?

గోవి:- అదే మాట సెప్తా వుండాం.

రా:- అబ్బే నాకిష్టంలేదండి.

గోవి:- ఏమామూలి బాత్ నై. ఆలోశ్నా సెయ్యండి. పూరా సోచో. తబ్ బతాయియే. హిప్డూ సూడండి. సేఠ్ గోవింద్ కా బాత్ కైసా చెల్తాహై. మార్కెట్ మే ఏ మోసంకీ బాత్ నై. మందీ మందీ భాయీ భాయీ మే దోస్తీకీ బాత్. కుచ్ జబర్దస్తీనై - సంజా.

రా:- కానీ...

గోవి:- సుసార్ లీజీయే.

రా:- (వక్కపొడి తీసుకున్నాడు.)

గోవి:- మీదీ మనస్ మాకీ తెలుస్. మాదీ పేర్ మీకీ మాలుం. మేరబాత్ టీక్. సమజ్‌లో - సంజా.

రా:- మీ మనసు నాకు తెలుసు. కానీ-

గోవి:- అరె కానీ కా బాత్ ఛోడో. ఓ అచ్ఛాన్నై, ఇస్ కాంమే హాత్ మిలావ్. దిల్‌సే బేపార్ కరో. ఇది మీకీ మంచి, మాకీ మంచి. (ఇంతలో నారాయణ రావుగారు వచ్చారు.) ఏ ఆప్‌కా పితాజియా? ఆయీయే...ఆయీయే బైఠీయే.

నారా:-ఎవరురా యీయన ?

రా:- సేఠ్ గోవిందదాస్ గారు. మన మేడప్రక్క మేడే చాలా మంచివారు.

నారా:- అలాగా.

గోవి:- నమస్తే.

నారా:- నమస్కారం.

గోవి:- అచ్ఛా - రామంజీ...

రా:- త్వరలోనే ఆలోచించుకుని మీకు యే కబురూ తెలియ జేస్తాను. సరేనా ?

గోవి:- తబ్ ఠీక్ హై. ఖూబ్ సోచ్ కే బతాయీయే. మరి
శలవ్ యిప్పిస్తారా.

రా:- అలాగే. మంచిది వెళ్ళిరండి.

గోవి:- జై రాంజీకీ -

రా:- జై రాంజీకీ -

(సేట్ వెళ్ళిపోయిన తదుపరి గోపీ ఒక షీల్డు తీసుకుని పరుగెత్తుకుంటూ వచ్చాడు.)

గోపీ:- తాతయ్యా తాతయ్యా !

నారా:- ఏమిటి బాబూ ?

గోపీ:- ఇది నాకు School లో Present చేశారు. పాటల్లో
నాదే I st prize

రా:- అరేయ్ గోపీ ? తాతయ్యను నీ సోదిలో గోలపెట్టక
కాసేపు నిద్రపోనీ - చెన్నయ్యా ( అని పిలుస్తూ లోప
లికి వెళ్ళిపోయాడు.)

నారా:- ఏం పాట పాడావు. చిట్టిబాబుకు పెద్ద Cup యిచ్చారే?

గోపీ:- మరి I st prize కదూ.

నానా:- మరయితే ఆపాట మీ తాతయ్య చెవినికూడా వెయ్యి

గోపీ:- పాడనా?

నారా:- ఊఁ ( గోపీ ఉత్సాహంగా "ఏ దేశమేగినా ఎందు
కాలిడినా" అనే పాట మొదలుపెట్టాడు. ఒక చరణం

జరిగింది. చెన్నయ్య లోపల్నుంచి వచ్చి ఒక ప్రక్కనే నిల్చున్నాడు తర్వాత రామం లక్ష్మికూడా వచ్చారు మంత్రముగ్ధుల్లా వెనకనే నిల్చుండి పోయారు పాట అయిపోయిం తర్వాత చప్పట్లు కొట్టారంతా)

నారా:- ఎంత చక్కగా పాడావు బాబూ హృదయం పులకరించేలా. ఎవరు నేర్పారురా యీపాట? ( లక్ష్మి చెప్ప వద్దని సైగచేసింది. కానీ రామం చెప్పమని సైగ చేశాడు. గోపీ చెప్పేశాడు.)

గోపీ:- అమ్మ నేర్పింది తాతయ్యా?

నారా:- ఆఁ అలాగా ఎంతచక్కని పాట నేర్పావమ్మా లక్ష్మి జాతికే వన్నె తెచ్చేపాట ఎంతకమ్మగా వుంది. ఏ మహానుభావుడు వ్రాసేడో కానీ (Pause)

గోపీకి తల్లివయి నీవు ధన్యురాల వయ్యావు లక్ష్మి. అరేయ్ రామం లక్ష్మికి భర్తవయి నీవూ ధన్యుడి వయ్యావు. ( లక్ష్మి గోపీని దగ్గరకు తీసుకుంది. తర్వాత రామం లక్ష్మి ఒకరి నొకరు చూసుకున్నారు.)

తండ్రికి బుద్ధి చెప్పే తనయుడిని కన్నందుకు నేనూ ధన్యుడి నయ్యాను.

చెన్న:- ఇంత మంచి యింటిలో పని దొరికినందుకు నేనూ ధన్యుడి నయ్యాను బాబూ?

నారా:- అవును చెన్నయ్యా. మనమందరం ధన్యులమే చూడు. చక్కని సంసారం. ముద్దు లొలికే మనుమడు. ప్రాణ మొక యెత్తుగా చూచుకొనే కొడుకూ కోడలూ కల్మషములేని పవిత్ర హృదయాలు. ఇంతకంటే కోర తగిందీ సౌఖ్యము యివ్వ కలగిందీ యింకేముంది చెన్నయ్యా కోటి వరహాలిచ్చినా యిలాంటి సుఖం దొరకుతుందంటావా ?

చెన్న:- డబ్బులో యేముంది బాబూ పెద్దవడబ్బు మనసులో వుండాలికానీ ?

నారా:- లక్ష వరహాల విలువచేసే మాటన్నావు చెన్నయ్యా! ఆస్తివున్నా ఆదరం ఆత్మీయతా లభిస్తయ్యా?

చెన్న:- నిజంబాబూ నిక్కమయిన మాటన్నారు.

నారా:- అనటంకాదు. అనుభవ మయిన మాట. ఒరేయ్, రామం లక్ష్మి మీరే గెలిచారురా సుఖానిచ్చేది డబ్బు కాదు ప్రేమ అని మీరు నిరూపించారు. నేనూ గ్రహించాను కలకాలం యీ బండి యిలా సాగిపోతే శ్రీరామరక్ష (నిట్టూర్పు విడిచాడు ఒక్కక్షణం నిశ్శబ్దం)

రామం:- నాన్నా లక్ష్మి ఒక ముఖ్యమైన విషయం మన మందరం ఆలోచించ వలసినది.

నారా:-ఏమిటది.

రా:- నేను, వ్యాపారం చేయబోతున్నాను.

లక్ష్మి:-వ్యాపారమా ?

రా:- అవును. సేఠ్ గోవింద్‌కు పెట్టుబడి కావాలట. బాకీ తీసుకోమన్నాను. కాదు, వాటా తీసుకోమంటు న్నాడు. ఆలోచించి చెప్తానన్నాను. మీరేమంటారు?

చెన్న:-కానిదేశంబాబూ! మన మాటా, మంచీకాదు. అంతా అరవగోడు. అంతా, దొంగముండాకొడుకులు, కాస్త వెనకా ముందూ ఆలోచించండి.

రా:- సేఠ్ అలాంటివాడు కాదులే, చెన్నయ్యా!

నారా:-ఏమనటానికీ యేముంది కానీ, వ్యాపారం వ్యామోహాపూరితమయింది. ముందుచూపుతో ఆలోచించుకొని నడవాలి. అనుభవంకూడా కావాలి. పూర్తిగా దానికి బానిసవు కాకూడదు. అలాఅయితే ఫర్వా లేదు. (Pause) చెన్నయ్యా! బడలికగావుంది. కాస్సేపు నడుంవాలిస్తే బాగుండు.

లక్ష్మి:- చెన్నయ్యా! మామయ్యకు పైన పక్క వేసిరా!

చెన్న:- అలాగేనమ్మా. (పైకి వెళ్లాడు).

నారా:. రాబాబూ. (గోపీని వెంటపెట్టుకుని పైకివెళ్లాడు).

రా:- (ఆలోచనగా) లక్ష్మి...

లక్ష్మి:- ఏమండీ?

రా:- మరి నీవేమి చెప్పలేదేం ?

లక్ష్మి:- చెప్పటానికి యేముంది. మీకు, యెలాతోస్తే ఆలా చేయండి ?

రా:- అయిదేళ్ళక్రితం ఒక్కసారి జ్ఞప్తితెచ్చుకో- మనమూ హాయిగా బ్రతకలేకపోయాం. గుమస్తా జీవితంతో విసిగిపోయాం. చివరకు లాటరీలకూ, ఫజిల్సుకక్కూడా దిగాను. అదృష్టం కలసివచ్చింది. ఒక్కసారిగా లక్ష రూపాయలు సంపాదించి లక్షాధికారులమయ్యాం.

లక్ష్మి:- గడచినరోజులు తిరగేస్తున్నారేం?

రా:- సేఠ్ చెప్పిన మాట నాకూ నచ్చింది. ఫజిల్సు డబ్బు వచ్చాక నేను ఉద్యోగం మానేశాను. ఏదో ఒక యిల్లు కొనుక్కున్నాం. సుఖంగానే కాలం వెళ్లబుచ్చుతున్నాం కానీ ?

లక్ష్మి:- మీ యిష్టప్రకారం చెయ్యక యీ ఆలోచనలన్నీ ఎందుకు ?

రా:- లక్ష్మి దరిద్రం చాలా ఘోరమయింది కదూ- ఏమంటావు ?

లక్ష్మి:- అయితే ?

రా:- అవును. చాలా ఘోరమయింది. నా కళ్ల ముందే చూశాను ఒక గుమాస్తా కన్న బిడ్డలకు పిడికెడు

మెతుకులు పెట్టలేక రైలు క్రిందపడి మరణించాడు. ఒక బడిపంతులు రోగాలతో రొష్టులతో కుళ్ళే సంసారాన్ని యీదలేక పిచ్చివాడయిపోయాడు. ఎంతో మంది కూలీలు ఆత్మహత్య చేసుకున్నారు. దరిద్రం ప్రాణాలనే బలిగొంటుంది?

లక్ష్మి:- ఏమిటి మాటలు ఇలా మాట్లాడుతున్నారెందుకీ రోజు?

రా:- ఈ రోజు మన Bank balance ఎంతో తెలుసా! లక్ష నుండి, అరవయి వేల రూపాయలకు దిగింది. ఇది కూడా అయిపోతే మనం దరిద్రులమయిపోతే హేయమైన దరిద్ర జీవితాన్ని అనుభవించగల శక్తి మనలో వుందా లక్ష్మి!

లక్ష్మి:- (తలవంచుకుంది)

రా:- లేదు. మనం అనుభవించలేము. ఆ శక్తి మనలో చచ్చిపోయింది. బాగా బ్రతకాలంటే డబ్బు కావాలి ఏమంటావు?

లక్ష్మి:- ఏమిటీ ప్రశ్నలన్నీ (రామం కళ్ళల్లోకి చూస్తు)

రా:- దరిద్రులం కావటానికి వీల్లేదు లక్ష్మి- ముందే నిద్ర లేస్తే మంచిది. అంగీకరిస్తాను. సేఠ్ యిచ్చిన సలహాను తప్పకుండా అంగీకరిస్తాను. బాగా డబ్బు

గడిస్తాను. మన జీవితాలు, సుడిగాలిలో పేకమేడలు కారాదు లక్ష్మీ. గోపీ దరిద్రమంటే ఏమిటో యెరుగడు - చిన్నప్పటినుంచీ గారాబంగా పెరిగాడు - దరిద్రమంటే మనకు అనుభవముంది కానీ, వాడికసలే తెలియదు. ఆటలు పాటలే వాడి జీవితం. వాడు మనకూ మన వంశానికీ ఆశాంకురం - ఆశాజ్యోతి. మనం దరిద్రులమయి వాడిని దరిద్రుడుగా చేయటానికి నా మనస్సంగీరించదు లక్ష్మీ. వాడు కష్టపడితే నేను చూడలేను. నేను బ్రతికుండగా నా బిడ్డ కష్టపడుతుంటే నా హృదయం ఓర్చుకోలేదు. మనకోసం, వాడి సుఖం కోసం యింకా బాగా సంపాదిస్తాను ?

లక్ష్మీ:- ఏమిటిలా, పిచ్చిగా మాట్లాడుతున్నారు!

రా:- డబ్బులో సుఖం లేదంటావా, లక్ష్మీ?

లక్ష్మీ:- ఎందుకు లేదు?

రా:- కానీ, నాకేదో భయంగావుంది. ఏదో బాధగావుంది లక్ష్మీ. నాన్నగారు, వ్యాపారం వ్యామోహపూరిత మయిందన్నారు. వ్యాపారపు వ్యామోహంలో, ధనార్జనలోపడి, మిమ్మల్ని పూర్తిగా మరచిపోతా నేమో?

లక్ష్మీ:- మీ వెర్రి వూహాలకు అంతులేదేం? వ్యాపారం చేస్తు

న్నంతమాత్రాన భార్యా బిడ్డల్నీ మరచిపోతారా? చేసేవారంతా మారిపోతున్నారా?

రా:- నీకు తెలియదు లక్ష్మీ! డబ్బు పాపిష్టిది. మనిషిని బానిసగా చేసుకొని కీలుబొమ్మనిచేసి ఆడిస్తుంది. అహంకారంతో మనిషిని గృడ్డివానిగా తయారు చేస్తుంది.

లక్ష్మి:- కానీ, వీరిలా యెన్నటికీ మారరు. మీహృదయం నాకు తెలియదూ? తెలిసినా ధైర్యం చేయరు. కానీ, పిరికితనంచేస్తే, ముందడుగు యెలా వేయగలం?

రా:- లక్ష్మీ! వ్యాపారం అన్యాయమంటావా?

లక్ష్మి:- మనం న్యాయంగానడిస్తే అన్యాయమెందుకవుతుంది.

రా:- అయితే యిప్పుడేచెప్తాను, సేఠ్ గోవింద్‌కు నా అంగీకారం తెలియజేస్తాను. చెన్నయ్యా. (జవాబురాలేదు మళ్ళా పిస్తూ కేకేశాడు) చెన్నయ్యా! చెన్నయ్యా!

చెన్న:- (పైనుంచి వస్తూ) వస్తున్నా బాబూ?

రా:- ఏంజేస్తున్నావు, యింతసేపూ పైన.

చెన్న:- కాస్త నడుంవాల్చగానే కాస్త కునుకుపట్టింది బాబూ.

రా:- సేఠ్ గోవింద్ దాస్‌గారిని నేనుపిలుస్తున్నానని వెంటనే పిల్చుకురా?

చెన్న:- అలాగే (వెళ్ళిపోతాడు).

రా:- (రామం ఆలోచనగా పచార్లుచేస్తూ ఆగి) లక్ష్మీ!
నాన్నగారేరి? ఓహో నిద్రపోతున్నారుకదూ, గోపీ యెక్కడకి వెళ్ళాడు?

లక్ష్మి:- పైకివెళ్ళాడు.

(ఇంతలో చెన్నయ్యా, సేఠ్ కలసివచ్చారు)

గోవి:- జై రాంజీకి (లక్ష్మి వెళ్ళిపోయింది)

రా:- జై రాంజీకి. కూర్చోండి. మాయింట్లో ఆలోచించాం అంతా సరేనన్నారు. మీరు యెప్పుడు కావాలంటే అప్పుడు నన్ను తీసుకు వెళ్ళవచ్చు. యాభయి వేలు నా Capital సరేనా?

గోవి:- పచాస్ హజార్ అచ్ఛా- బహుత్ అచ్ఛా కామ్ రేపట్లోగా పూర్తి హాయిపోతుంది. మాదీ మాట చెల్లించార్- మాకు రక్షించార్. బస్ వస్తాను శెలవు జై రాంజీకి-

రా:- జైరాంజీకి-

గోవి:- జై రాంజీకి- జైరాంజీకి. (అని గొణుక్కుంటు వెళ్ళి పోయాడు.)



# సందేశం

(చతుర్థ దృశ్యము)

(తెర తీయగానే హాల్లో యెవరు లేరు. రామం కోటు జేబులు పట్టుకుని వగర్చుకుంటూ 'టై' వూడదీసి వంకెకు తగిలించబోయాడు Spot Light "సత్యంవద ధర్మంచర" అనే బోర్డు కనపడింది, అది చూచి అవమానంతో బాధ పడ్డాడు – కృంగిపోయాడు. దొంగచూపులు చూస్తూ బోర్డు వెనక్కు తిప్పేశాడు. కోటుజేబులు గట్టిగా పట్టుకున్నాడు.)

రా:– (విసుగుతో, బాధతో కోపంగా) లక్ష్మీ! లక్ష్మీ!

చెన్న:–బాబుగారూ!

రా:– లక్ష్మి యేది!

చెన్న:–పడుకున్నారు బాబూ!

రా:– పిలిస్తే వినపట్టంలా!

చెన్న:–ఇందాక జ్వరమొచ్చినట్లుగా వున్దన్నారు బాబూ!

రా:– ఎప్పుడూ ఆ వంటగదిలో చావకపోతే కాస్త విశ్రాంతి తీసుకోగూడదు. ఎప్పుడూ రోగాలూ రొష్టులే యీ వెధవ కొంపలో (ఇంతలో లక్ష్మి వచ్చి గంభీరంగా నిల్చుంది. దుప్పటి ముసుగు వేసుకున్నది)

లక్ష్మి:–చెన్నయ్యా– భోజనాల గది శుభ్రంచేయి వెళ్లు. (చెన్నయ్య వెళ్లిపోయాడు– లక్ష్మి బూటు విప్ప బోయింది)

రా:- జ్వరంతగిలిందన్నా వ్వుటగా డాక్టర్ని పిలిపించి మందు తీసుకోకూడదూ ?

లక్ష్మి:-జ్వరంకాదులెండి, కొద్దిగా వేడిచేసింది అంతే.(మళ్లా, బూట్లు విప్పబోయింది.)

రా:- సరే, ఈపరిచర్యల కేంగానీ, ఈపైకం ఇనప్పెట్టెలో పెట్టు. (రెండు జేబులనుంచి రెండు 10 రూ. నోట్ల కట్టలుతీసియిచ్చాడు. కోటువిప్పి వెనక్కు-తిరిగి ఇంకా లక్ష్మి అక్క-డే వుండటంచూచి) ఇంకా యిక్క-డే నిల్చున్నావేం ?

లక్ష్మి:-ఎక్క-డిదండీ... ఈపైకం.

రా:- విస్తరాకులు ఎత్తేయ్యమంటే జనాభా లెక్క-ందుకు. ప్రతిదానికీ యేడుపు ముఖంపెట్టుకొని యెదురవుతావు (చెన్నయ్య లోపల్నుంచివచ్చాడు. రామం లోపలికి చరచరా వెళ్లిపోయాడు).

చెన్న: గది శుభ్రం చేశానమ్మా.

లక్ష్మి:-చెన్నయ్యా! బాబుగారితో ఏంచెప్పావు ?

చెన్న:-ఏమీా చెప్పలేదమ్మా ?

లక్ష్మి:-పైగా, అబద్ధాలెందుకు? కాస్తజ్వరం తగిలినంత మాత్రాన నాప్రాణం పోతుందనుకున్నావా? బాబుగారితో చెప్పావు- ఛీ ఛీ.

చెన్న:-అవి కాదమ్మా?

లక్ష్మి:-ఏంకాదు? వారసలే బుసబుసలతో యింటికి వస్తారు వనితో విసుగ్గా యింటికి వస్తే మీరు క్షణం ఊరుకోనివ్వరు. (నారాయణరావు బయటనుంచి వచ్చాడు లక్ష్మి గమనించకుండానే మాట్లాడుతూ వున్నది) ఈ వ్యాపారం పెట్టిన దగ్గర్నుంచి క్షణం తీరికలేదు వాడు యింటికి వచ్చీ వస్తూనేవున్నా కాస్త విశ్రాంతిగా ఉండనివ్వరండి. చెన్నయ్యా- ఇలాంటి మాటలు యింక యెప్పుడూ వారితో చెప్పకు (కళ్లలో నీరు బంధించి, కంఠం గద్గదమయ్యింది).

నారా:-అమ్మా, లక్ష్మి.

లక్ష్మి:- (సర్దుకుని) మీరా! మామయ్యా! ఎంతసే పయిందివచ్చి?

నారా:-ఏమిటీ, చెన్నయ్యతో అంటున్నావ్.

లక్ష్మి:- ఆఁ ఏమిలేదు. మీరు భోజనానికిలేవండి. ఇప్పటికే చాలా ప్రొద్దెక్కింది.

నారా:-అంతా, అర్థమయిందమ్మా! వాడు పూర్తిగా, మారిపోయ్యాడు. ఇప్పుడు వాడికా Factory యే పెళ్లాం బిడ్డలూను. డబ్బు అలా చేస్తుందమ్మా. బంధువులు, పెళ్లాం, బిడ్డలు, యిల్లు పట్టకుండా చేస్తుంది.

వీడు ప్రయోజకుడవుతాడనుకున్నాను. నేను చేసిన నేరం వీడు చేయడనుకున్నాను కానీ, నా ఆశలు, నిరాశలయిపోయాయి!

లక్ష్మి:—మామయ్యా! దొంగవ్యాపారం పాపంకదూ?

నారా:—విన్నానమ్మా – అన్నీ విన్నాను. డబ్బుకోసం వీడు, Black Market కూడ చేస్తున్నాడు.

లక్ష్మి:—ఈ సంగతి పోలీసులకు తెలిస్తే ప్రమాదం కదూ. మొన్న యెవరినో దొంగవ్యాపారిని జైల్లో వేశారని, విన్నప్పటి నుంచీ, నాకేదో భయంగావుంది మామయ్యా!

నారా:—వాడిని మంచి దారిలోనికి తేవటానికి, నేను చేయవలసిన ప్రయత్నమంతా చేస్తాను. తర్వాత, ఆ భగవానుడిదయ!

లక్ష్మి:—వారు యింట్లో వుంటేను, యీ యింటికి ఒక కళ. వారే ఈ యింటికి, దూరమయిపోతే – యీ సంసారం యేంకావాల?

నారా:—చెప్పిచూద్దాం – వాడి దిగులులోపడి, నీవు మనసు పాడుచేసుకోకు, నీ ఆరోగ్యం, యేంబాగాలేదు. చిక్కిశల్యమై యెలా మారిపోయావో చూడు!

లక్ష్మి:—వారికి, భోజనం చూడలేదింకా – (తన్ను, తాను సంబాళించుకుంటూ వెళ్లిపోయింది.)

నారా:-భగవాన్ - ఏమిటీ యీ నాటకం? సుఖానవున్న జీవుల్ని, కష్టాలపాలు చేస్తేనా, నీకు సంతోషము- మనసులు, యీ విధంగాచేసి, కీలుబొమ్మలుగా మార్చి, ఆడించుటయేనా, నీ పరమావధి. (బయట నుంచి 'సార్' అనే కేక. చెన్నయ్య లోపల్నుంచి, బయటకు వెళ్లి కవరు ఒకటి తెచ్చాడు.)

నారా:-ఏమిటి చెన్నయ్యా అది?

చెన్న:-బాబుగారికి? యేదో వుత్తరం వచ్చిందండి?

నారా:-గోపీ కాలేజీ నుంచి వచ్చాడా?

చెన్న:-రాలేదండీ యింకా?

నారా:-గోపీ వచ్చాక పిలు మేమిద్దరంకలసి, భోంచేస్తాంలే. అమ్మాయిని భోంచేయమను.

చెన్న;-అలాగే బాబూ? (నారాయణరావు పైకి వెళ్లి పోయాడు. రామయ్యబల్లలు, తుడుస్తుండగా, బయట నుండి గోపీ వచ్చాడు. కొంచెం పెద్దవాడయ్యాడు - జుట్టు రేగిపోయింది, ముఖం కూడా కొంచెంగా వాడి పోయింది.)

గోపీ:- చెన్నయ్యా!

చెన్న:-బాబూ?

గోపీ:- నాన్నగారు Factory నుంచి వచ్చారా?

చెన్న:-వచ్చారు భోంచేస్తున్నారు.

గోపీ:- తాతయ్యా ! భోంచేశారా ?

చెన్న:-లేదు బాబూ - మీరు వచ్చాక, కలసి భోంచేస్తా మన్నారు. పైనున్నారు.

గోపీ:- సరే, నాన్నగారు భోంచేశాక, పిలు ?

చెన్న:- అలాగే ?

గోపీ:- (గోపీ రెండు మెట్లు యెక్కి- గోడనంక చూచి, వెనక్కు- వచ్చి "సత్యం వధ ధర్మం చర" అన్న బోర్డును సరిచేసి వెళ్ళాడు. చెన్నయ్య బల్లలు తుడుస్తుండగా రామం వచ్చాడు)

చెన్న:- బాబుగారు (ఉత్తరం అందించాడు)

రామ:- (ఉత్తరం చదివాడు) లక్ష్మి ... లక్ష్మి - (పెద్దగా అరిచాడు లక్ష్మి ఖంగారుగా వచ్చింది.)

రామ:-ఏడివీడు - కాలేజీనుంచి, దయచేశాడా ?

లక్ష్మి:- (ఏం మాట్లాడ లేదు.)

చెన్న:-చినబాబు గారాండి ?

రామ:-ఆః చినబాబుగారే. నా ప్రాణానికి, ఒక కంటకంగా తయారయ్యాడు, వీడు.

లక్ష్మి:- ఏమిటి చెన్నయ్యా అది ?

రామ:- ఏమిటీ - తనయుడు చేస్తున్న ఘనకార్యాలు. కాలేజీ కుర్రాళ్లను రెచ్చగొట్టి Strike చేయిస్తున్నాట్ట.

ఎవరో, అల్లరివెధవలను కాలేజీనుంచి తీసివేస్తే వీడి కెందుకు. వాళ్ళేమన్నా, త్రవ్వి తలకెత్తుతారనా. ఇదిగో Principal ఉత్తరం వ్రాశాడు. లక్ష్మి వీడి ప్రవర్తనకు, మరీ హద్దూ పద్దూ లేకుండా పోతుంది. చెన్నయ్యా పైన కొలువు తీర్చాడా నాయకుడు – పిలు ఒకసారి (చెన్నయ్య పైకి వెళ్ళాడు.)

లక్ష్మి:–మీరూరోకోండి – నేను కనుక్కుంటాను.

రా:– చిన్నప్పటినుంచీ అలుసుయిచ్చి, యీవిధంగాతయారు చేశావు వాడిని. రౌడీవెధవలాగా. (పైనుంచి నారాయణరావు, గోపీ, చెన్నయ్యా వచ్చారు. రామం కోపంగావుండటంచూచి గోపీ).

గోపీ:– ఏమిటమ్మా... (రామం తీవ్రంగాచూశాడుగోపీవంక)

లక్ష్మి:–ఏమిలేదు – భోజనానికి వేళయితే, రాకుండా పైనేం చేస్తున్నారుయింకా. మామయ్యా భోజనానికిపదండి చాలా ప్రొద్దెక్కింది. (అందరూ వెళ్లబోయారు బయటనుంచి 'రామంజీ' అనే కేకవినిపించింది. లక్ష్మి లోపలికి వెళ్ళిపోయింది. గోపీ నారాయణరావులు నిలబడిపోయారు.)

గోపి:– హాం – అందర్ ఆసక్తాహైఁ (వినాయకరావ్ శేఠ్ కూడా వచ్చారు)

గోవి-వినా:- జై రాంజీకి-

రామ:-నమస్కారం కూర్చోండి.

గోవి:- చెన్నయ్యా తీక పాల్ లావ్ - (డబ్బులు యివ్వ బోయాడు - వారించి రామం యిచ్చేశాడు.)

గోవి:- ఆప్ ఖానా కతంకియా?

రామ:- ఆఁ యిప్పుడే అయింది.

గోవి:- అచ్చా - (వినాయకరావ్ సేఠ్‌తో) ఈయనగారు రామంసేఠ్ మా Firm కా Partner వీరు వినాయక రావ్ సేఠ్ షోలాపూరు —— (రామంతో) బహుత్, జరూర్ కామ్, యిధర్ ఆగయా.

వినా:- నమస్తే!

రామ:-నమస్తే!

గోవి:- (నలుసైపులా చూస్తు, సణుగుతూ) హాం, సబ్ ఊపర్ జాసక్తా.

రామ:-ఫరవా లేదు. యిక్కడ పరాయి వాళ్లెవరున్నారు.

గోవి:- రామంసేఠ్ ఏ బేపార్‌కీ బాత్ హై (గోపీ నారాయణ రావుల వంక ఓరగా చూచాడు.)

లక్ష్మి:-(లోపల్నుంచి) గోపీ! భోజనంవడ్డించాను రండి. (ఇద్దరూ, ఒకరిముఖంఒకరు చూచుకొని వెళ్ళిపో యారు. బ్రతుకుజీవుడాఅని రామం...ఒక్కనిట్టూర్పు

విడిచాడు).

గోవి:- రామంభాయి - యీయన మంఛీ ఆద్మీ. హమారా Firm కా Agency కావాలంటున్నాడ్.

రా:- ఎక్కడ.

గోవి:- షోలాపూర్ లో నే.

రా:- మనకు, షోలాపూర్ Agent వున్నాడుకదూ? (ఇంతలో చెన్నయ్యవచ్చి కిళ్లీలు తెచ్చియిచ్చి, ప్రక్కనే నిల్చున్నాడు. గోవింద్ పరకాయించిచూచి సంభాషణ ఆపివేసాడు).

రా:- చెన్నయ్యా - యిక్కడెందుకు, లోపలికి వెళ్ళరాదూ (చెన్నయ్య వెళ్ళిపోయాడు).

గోవి:- పురానా ఆద్మీకి నికాల్నా.

రా:- ఎందుకు?

గోవి:- బేపార్ కి తరహ్ ఆప్ కి యింకా మాలుంనై.

వినా:- బాబూజీ, ఆప్ దయాకర్నా - మేం మీ ఉపకారం ఉంచుకోంలెండి - క్యాసేత్ సాహబ్.

గోవి:- సోఛో భాయీ.

రా:- మరి, అతన్నెలా తీసెయ్యటం.

గోవి:- అదీ, మందీ చేతిలోపని.

వినా:- దిల్ వుండావాలా కానీ, యిది హెంతపనండీ?

రామ:-అయితే ఏమిటంటారు -

గోవి:- దస్ హాజార్ మైనే బతాయా.

వినా:- సేఠ్‌జీ కృపాకర్లో. పాంచ హాజార్ సెటిల్ కరో -

గోవి:- వినాయకరావ్ సేఠ్ మాదీ హాక్టీ మాటచెప్తా, ఖరార్, అంటే సై - నైతో, ఛోడ్‌దో క్యానామంజీ- ఆఠ్ హాజార్ ఆఖరీమాట.

వినా:- సేఠ్‌జీ ?

గోవి:- బస్ - మీాకీ నచ్చింది. పారెయ్యండి నైతో రాంరాం-

వినా:- హుఁ లీజీయే ?

గోవి:- అచ్ఛా, బహుత్ అచ్ఛా. రామంసేఠ్ లీజీయే చార్ హాజార్ - (రామం తీసుకున్నాడు. గోవింద్ యిద్దరికి సిగరెట్ offer చేశాడు.) అరెహా చెన్నయ్యా - అరె యూర్ జెల్దీ ఆవో ?

చెన్న:-ఏంబాబూ ! (గోవింద్ ముందున్న పైకం లాక్కు- న్నాడు.)

గోవి:- ఆఁ కుఛ్ నై. ఏ రూపియా తుంలేజావ్, తీన్ ఛా లావ్. బడియా - మిగిలిన పైసా తుంఖావో - జావ్.

చెన్న:- మిగతాది లంచమా !

గోవి;- (గతుక్కుమని) లంచం - లంచం క్యా - ఉస్ కాబాత్ హంకూ క్యామాలుం.

వినా:- సేఠ్‌సాబ్, అబ్ కుఛ్ నై హోనా - బజార్‌మే మొరేకు,

జరూర్ శాంహై. ఫిర్ మిలింగే జై రాంజీకు –
(వెళ్ళిపోయాడు).

గోవి:– (నవ్వుతూ) ఫిర్ మిలేంగే, రామం సేట్ బేపార్ మే
దయా, అవుర్ ధర్మ్ ఛోడ్ దేనా – మట్టిసే సోనా
నికాల్నా. అవుర్ మట్టీకు సోనాబనానా – సంజా.
(ఇంతలో, భిక్షాలనేకూలీ వచ్చాడు. బనీను, పంచ
మాత్రమే వేసుకున్నాడు. పైన తుండుగుడ్డవున్నది.)

భిక్షా:–(అమాంతంవచ్చి, కాళ్ళమీదపడి) పసి కందుల్ని
రక్షించాలిబాబూ !

రా:– ఏమిటి భిక్షాలూ –

గోవి:– రోతాక్యూ రే – భూత్.

భిక్షా:– ఫ్యాక్టరీలో పనిచేస్తుండగా ఖాసింకాలువిరిగిపోయింది.
బాబూ – ఆస్పత్రిలో చేర్చాం.

గోవి:– క్యా– పాం ఫట్ గయా – భూత్, (నారాయణరావు,
గోపీ వచ్చారు).

భిక్షా;–ఖాసింతండ్రికి, కళ్లుకనపడవు. భార్యా గర్భిణీతో
వుంది. రెండేళ్ళనుంచీ మిమ్మల్నే నమ్ముకున్నాడు
బాబూ – పిల్లలుగలవాడు– రక్షించాలిబాబూ.

రామ:–ఏంచేయమన్నావ్ – భిక్షాలూ ?

గోవి:– వాడ్కి– కాలు యిర్గితే, మాకీ యేంసేస్తాం!

భిక్షా:-ఆ దిక్కు లేని, కుటుంబానికి, శాస్త్ర దారి చూపించండి బాబూ?

రామ:-మేమేం చెయ్యగలం, ఆతని అజాగ్రతకు మేమా బాధ్యులం భిక్షాలూ?

గోవి:- వాడి ఖర్మాన వాడ్కి కాలుయిర్గితే మాదిక్యా - జా - జా?

రామ:-భిక్షాలూ ఇదిగో ఈ పదిరూపాయలు తీసుకెళ్లు.

భిక్షా:-పదిరూపాయలు - ఖాసిం చేసిన, సేవకు కష్టానికి, పదిరూపాయలు విలువ కట్టియిస్తున్నారా బాబూ? రెండేళ్ల బండ చాకిరీకి, వంట్లో రక్తమాంసాలు వడిచి నందుకు - ఫలితం పదిరూపాయలా బాబూ! రోగాలతో, రొష్టులతో, కుళ్లిపోయే ఖాసిం సంసారానికి పదిరూపాయలు, విలువ కట్టియిస్తున్నారన్న మాట.

రామ:-అవును. యిదిదానమే దయతలచి, యిస్తున్నాం. అతని అజాగ్రతకు యిందులో మాదోషం యేమిలేదు ఈ పదిరూపాయలు తీసుకెళ్లి, ఖాసిం కుటుంబనికి యివ్వు?

భిక్షా:-దండాలుబాబూ - మీదానం మీదగ్గరే వుంచుకోండి. మమ్మల్ని దేవుడే దిక్కులేనివాళ్లుగా చేశాడు. భూమికే భారంగా బతుకుతున్నాం. కన్నీటితో మాబతుకులు రాశిపెట్టుంటే, మీరేంచేయగలరు? మనుషులుగా

పుట్టినా మనుషులుగా, బతకమనలా. భగవంతుడు. కలకాలం కష్టించినా, కూటికే పేదలుగాచేస్తే, మీ రేంచేయగలరు! రెండి వస్తాను. (వెళ్ళిపోయాడు).

గోపీ:- ఆగు భిక్షాలూ? (అంటూ, గోపీవైపు తిరిగాడు.) నాన్నగారూ - ఖాసిం జీవితం గంగలో కలిసింది. కష్టాలలోవున్న అతనికి, ఓ చెయ్యి అందించటం మన కర్తవ్యం.

రా:- గోపీ? (అరిచాడు)

గోపి:- క్యా - కహా (అరుపులువిని లక్ష్మి లోపల్నుంచి వచ్చింది.)

గోపీ:- సేఠ్ గారూ అతను, మీ Factory లో పనిచేశాడు. ఇప్పుడు, దురదృష్టవశాత్తు కాలువిరగ్గొట్టుకున్నాడు. అతని కుటుంబానికి, అతనుతప్ప యింకెవ్వరూ లేరు ఆధారం. అయినప్పుడు, అతని కుటుంబపు బాగోగులు మనంకూడా చూడాలి. పదిరూపాయలు దానం యివ్వటానికి ఖాసిం అడుక్కుతినేవాడు కాదు.

రా:- నోర్ముయ్ వెధవా! అర్థంపర్థంలేని పిచ్చివాగుడు వాగకు.

గోపీ:- నాది పిచ్చివాగుడుగా కన్పించటంలో, మీ తప్పేమీ లేదు - ఇప్పుడు మీ మట్టూవున్న దెయ్యాలూ, భూతాలు, మిమ్మల్ని అలాపలికిస్తున్నాయి.

లక్ష్మి:—గోపీ —

గోపీ:— అమ్మా!

లక్ష్మి:—ఏమిటీమాటలు! పెద్దాచిన్నా లేకుండా.

గోపీ:— ధర్మా ధర్మాలకు పెద్దాచిన్నా యేముందమ్మా.

లక్ష్మి:—అనిచెప్పి, కన్నతండ్రినే యెదిరిస్తావా?

గోపీ:— ఎవర్ని యెదిరించటం నా ఉద్దేశ్యంకాదు నిజం చెప్పటమే.

లక్ష్మి:—సరేలే! ఊర్కో, ఆయనమనసు కష్టపెట్టుకుంటారు.

గోపీ:— ఎందుకమ్మా— అంతబాధ. ఒకమనిషి మనసు కష్ట పడుతుందని నన్ను వారిస్తున్నావా. మనకనులయెదుటే ఒకకుటుంబం, అన్యాయంగా నిలువునా కూలిపో తుంటే; వారించలేవేం? తండ్రికి క్షయ, భార్యగర్భిణి. పాలుత్రాగే పసికందులు దిక్కులేని పక్షుల్లా అల్లాడు తుంటే వాళ్ళజీవితాల్లో వీళ్లు నిలువునా నిప్పులు, కృమ్మరిస్తుంటే వద్దని వారించవేం అమ్మా?

రా:— చూచావా! నీ కొడుకు ప్రతాపం, నాయకత్వం. బజార్లోనే ననుకుంటే యింట్లోకూడా ప్రారంభించాడు

గోపీ:— పొరబడుతున్నారునాన్నా— మనమూ దరిద్రులమే అయితే మనకూ యిలాంటి ఆపదలేవస్తే అప్పుడు మనగతేమవుతుంది.

లక్ష్మి:-గోపీ? ఏమిటామాటలు ?

రా:- పొగరెక్కినమాటలు.

గోపీ:- మరలకు మనసులుండవు. మనుష్యులకుకూడా, మనసు లుండవని యిప్పుడు తెలిసింది. భూసింకు మనసులేని మరచేసిన అపకారం, కాలువిరగ్గొట్టడమే. కానీ- మీరు కుటుంబాలకు కుటుంబాలనే సమాధులుగా చేస్తున్నారు. వాడలకు, వాడలనే శ్మశానాలుగా మారుస్తున్నారు- ఈ అన్యాయాలన్నిటినీ సహించి -

లక్ష్మి:-గోపీ! (చెంపపై కొట్టింది. కానీ, వెంటనే కరుకు తనంపోయి, కంఠం గద్గదమయ్యింది కళ్ళలో నీరు చిందింది) నాయనా! గోపీ, తండ్రీ కొడుకులు పడ కూడదు బాబూ ?

గోపీ:- ఇది తండ్రీ కొడుకులమధ్య తగవు కాదమ్మా- న్యా యానికీ అన్యాయానికి, ధర్మానికి అధర్మానికీ, మాన వత్వానికీ రాక్షసత్వానికీ, మధ్యజరిగే సంఘర్షణ అమ్మాయిది. అక్రమానికీ, అన్యాయానికీ, అహంకా రానికి ఆహుతి పేదల బాధలగోడమ్మా యిది. భరతమాత గుండెల్లో, రేగిన ఆవేదనలో కన్నకడుపు జరిగేఅన్యాయానికీ, కన్నతల్లి ఆక్రోశించే కన్నీటి కథలమ్మాయివి. ఈ ధర్మాధర్మ యుద్ధంలో

తండ్రీ కొడుకులనీ, అన్నదమ్ములనీ, విచక్షణే లేదు ధర్మంకోసం, సత్యంకోసం, కన్నతండ్రినే కాదు, ఎవ ర్నయినా, ఎదిరించటానికి అవకాశం యివ్వమ్మా.

లక్ష్మి:-గోపీ... (మరిమాట్లాడ లేకపోయింది).

రామ:-గోపీ! తండ్రీ కొడుకులు బంధాలే, నీవు తెగతెం పులు చేస్తున్నప్పుడు, అనురాగం నాకు మాత్రం యెందుకుండాలి. ఇది నాయిల్లు - నా సమస్య - లేక పోతే, నీకీయింటిలో స్థానం లేదు.

లక్ష్మి:-ఏమండీ - మీరూరుకోండి.

నారా:-ఏమిటిరా? నువ్వంటున్నది వాడిని, పసివాడిని...

గోపీ:- వస్తాను- ఇందులో మీరుబాధపడవలసిందేమీ లేదు తాతయ్యా. కూటికోసించి - ముష్కరలోకానికి సలాంకొట్టే గులామును కాను నేను. వస్తానమ్మా - పద భిక్షాలూ.

భిక్షా:-మాకోసం మీరెందుకు బాబూ - వద్దు. దేవుడే, మమ్మల్ని యిలాబతకమంటే-

గోపీ:- దేవుళ్ళెప్పుడూ యిలా చెయ్యరు - దేవుడు ముసుగులో దాక్కున్న దెయ్యాలేవో యిలా చేయిస్తున్నాయి కష్టపడే ప్రతివానికీ బాగాబ్రతికే హక్కుంది. ఎంగి లాకులకోసం కక్కుర్తిపడే అవసరం లేదు - పద భిక్షాలూ.

లక్ష్మి:—గోపీ !

నారా:—రామం —

గోపీ:— వస్తానమ్మా — నీవు నాకు ఉగ్గుపాలతో నేర్పిన, న్యాయంకోసం, ధర్మంకోసమే వెళుతున్నాను. న్యాయానికి, ధర్మానికీ, జయంకలిగిననాడే మళ్లీనీపాదాల దగ్గరకొస్తాను. (భిక్షాలు తోసహా బయటికి వెళ్ళిపోతాడు).

లక్ష్మి:—గోపీ — మీరయినా పిలవండి ?

నారా:—నాయనా ! రామం ? పిలవరావాడిని, కోపంతో వెళ్లిపోతున్నాడు ?

లక్ష్మి:—పిలవరేమండీ —

రామ:— నే నేం పిలువను — నాకేదో పిచ్చెత్తినది. వెళ్ళండి. మీరంతా ఎక్కడివాళ్లక్కడకు పొండి. (గోవింద్ చెన్నయ్యలు వెళ్ళిపోయారు — రామం కుర్చీలో కూలిపోయాడు. )

లక్ష్మి:—ఆఁ మీ హృదయం ఇంత కఠినంగా మారిపోయిందా! గోపీనే వేరుచేస్తున్నారా — ఇన్నాళ్లూ ! ఎంతో ఓర్పు వహించాను. మీ కోసం కుళ్ళిపోయాను. కానీ, నన్నూ — నా బిడ్డనూ, వేరుచేస్తారనుకో లేదు.

రామ:—లక్ష్మి — (చెంపమీాద కొట్టాబోయాడు.)

నారా:—రామం — ఛీ !

రామః:- అనండి - అందరూ నన్నే అనండి, ఎందుకు నన్నిలా బాధ పెడతారు - నన్నెందుకు హింసిస్తున్నారు. నా కొంపను నానాటికీ, నరకం చేస్తున్నారేం -

నారా:- నీ చేతులారా! నీవు చేసుకుంటున్నది కాక పైగా ఎవరో చేస్తున్నారంటావేల సిగ్గు లేకుండా?

రామః:- నేనేం చేశాను - నా సంసారం కోసం, నేను పడే కష్టాన్నంతా మరచిపోయి యిలా దూషిస్తారెందుకు. ఇన్నాళ్లూ, ప్రేమతో పెంచిన కొడుకు, ఎదురుతిరిగి వెళ్ళిపోయాడు. కట్టుకున్న భార్యకరకు మాటలతో గుండెల్లో కలత రేపింది. చివరికి మీరూ దూషించారు. నేనేం అపరాధం చేశానని, నా కుటుంబ సౌఖ్యం కోరుకోవటం కూడా నేరమేనా. పగలూ, రేయన కుండా, రెక్కలు దాచుకోకుండా కష్టపడి పనిచేస్తు - దోసిళ్ళతో, డబ్బు మీ ముందు కుమ్మరిస్తుంటే మీ అందరికి నేను చేదయిపోయానెందుకు -

లక్ష్మి:- మీ డబ్బును చూచుకొని, మీరే సంతోషించండి, హాయిగా వుండండి. మీ కింకేమి అవసరం లేదు. పెళ్లాం బిడ్డలూ, యిల్లూ సంసారం, యింకేమీ అవసరంలేదు. మీ కావలసిందల్లా డబ్బు - డబ్బే (ఏడ్చింది.)

రామ:-ఏమిటీ యీ డబ్బంతా, నా కోసమా - నే నేం చేసు
కుంటాను ?

లక్ష్మి:-ఆ డబ్బును, చూసుకొనేగా గోపీని వెళ్ళగొట్టారు.
ఒకనాడు గోపీ, మన ఆశాజ్యోతి మన వంశాకురం అనీ,
ఉప్పొంగి పోయారే. ఆ ఆశాజ్యోతిని, దూరంచేసి
చీకటిమయం చేస్తున్నా రెందుకు. నా కళ్ళముందే నా
బిడ్డను, వేరుచేశా రెందుకు ?

రామ:-వాడిని, నేను తరిమివేశానా - అబద్ధం. వాడే వెళ్ళి
పోయాడు. వాడూ దరిద్రం భరించలేడనీ - వాడు
దరిద్రుడయితే, మనం చూడలేమనేగా నేను యీ
ధనార్జన జేస్తుంది. కానీ, కన్నతండ్రినే పదిమందిలో
అవమానపరుస్తాడా ?

లక్ష్మి:-నిజం మాట్లాడటమే తప్పయితే, వాడుచేసిందికూడా
తప్పే. కూటికిలేక కుమిలిపోయే, ఒక కుటుంబానికి
దారిచూపించమనుటేనా వాడుచేసినతప్పు. పైగా,
ధనార్జనంతా వాడికోసమేనని, మీపాపంలో, వాడికి
భాగం పంచుతా రెందుకు? వ్యాపారం చేయబోయే
ముందు, ఏ అన్యాయమూ చేయనని మాటయిచ్చారే
ఇలా అన్యాయాలూ, అక్రమాలూ చేసి, గడించి

సుఖంలేకుండా చేస్తున్నారెందుకు - మీరు సుఖపడ లేని యీ ధనార్జన - చివరికి కన్నకొడుకును, దూరం చేసుకునేందుకేనా.

రామ:-లక్ష్మీ - (ఆవేదనతో అరిచాడు. ఇంతలో ఒక అపరిచిత వ్యక్తి లోనికివచ్చాడు.)

రామ:-ఎవరుమీరు ? మిమ్మల్ని-

వ్యక్తి:-ఎక్కడో చూసినట్లుగుర్తు కదూ-

రామ:-అవును.

వ్యక్తి:-ఇంతకుముందుగానే యిక్కడకు వచ్చానులెండి-

రామ:-మీరా ? యిక్కడికా ?

వ్యక్తి:-అవును. మారువేషంలో.

రామ:-మీరు వినాయక్ రావ్ సేఠ్ - షోలాపూర్ Agency కావాలని.

వ్యక్తి:-ఎనిమిదివేల రూపాయల లంచం ఈ చేతులతోనే తమకు దక్షిణగా సమర్పించుకున్నాను.

రామ:-అవును. నేను లంచం తీసుకున్నాను.

వినా:- అంతేకాదు - ఖాసిం ప్రాణాలుకూడా తీసుకున్నారు. సరియైన వైద్యసహాయంలేక, ఖాసిం యిప్పుడే చచ్చిపోయాడు. అతను చనిపోయిన మరుక్షణంలోనే, భార్యా ప్రసవించింది. ఇదంతాచూచి క్షయతో బాధ

పడుతున్న చంద్రికకి మతిపోయి పిచ్చెక్కింది. దిక్కు లేని అతని పసిపిల్లల్ని ఒక్కసారి చూస్తారా - మీ కటికగుండెలో యిప్పటికయినా, కరుణకలుగుతుందా?

రామ:-ఆగండి! వినాయకరావ్ సేఠ్ - చాలు - యీవిన్నది చాలు- నాపాపం నన్ను దహించి వేస్తోంది.

వినా:- వినాయకరావ్ సేఠ్ - కానీ యిప్పుడు లంచంపుచ్చుకోవటానికిగాని, యివ్వటానికిగాని, నేను వినాయక్ రావ్ సేఠ్‌నుగాను మీ లాంటి లంచగొండులకు, దొంగవ్యాపారస్తులకు, తగినశాస్తి జరిపించే C. I. D. గనేష్‌ని. ఇదిగోండి - Arrest Warant, బయట పోలీసులు గోవింద్‌సేఠ్‌గారితోసహా సిద్ధంగావున్నారు. నడవండి.

లక్ష్మి:-అరెస్టా—

నారా:-రామంన్నా—

రామ:-లక్ష్మి......(కళ్లలో నీరుచిందింది.)

లక్ష్మి:-(గనేష్‌కాళ్లమీద పడింది) ఏమండి, వారేం యెరుగరు. వారిని విడిచిపెట్టండి- కావాలంటే మా ఆస్తంతా తీసుకోని, వారిని విడిచిపెట్టండి

గనే:- క్షమించమ్మా- నేరంచేసినవాళ్లు అనుభవించకతప్పదు. లంచం తీయటం రాజ్యాంగానికి విరుద్ధం. ప్రజలకూ, ప్రభుత్వానికీ ద్రోహం.

రామ:-వస్తాను. మిస్టర్ గనేష్- నాపాపాలకు తగిన ప్రాయశ్చిత్తం జరగాలి.

లక్ష్మి:-ఏమండీ !

రామ;-(ముఖం ప్రక్కకు తిప్పుకున్నాడు).

లక్ష్మి:-చివరకు మీారుకూడా, దూరమయిపోతున్నారా-

నారా:-ఊరోక- లక్ష్మి-

చెన్న:-బాబుగారూ...

రామ:-చెన్నయ్యా-

చెన్న:-బాబూ-

రామ:-Mr. గనేష్, పదినిమిషాలు గడువివ్వండి. నా గోపీని ఒక్కసారి చూడాలనివుంది. చెన్నయ్యా వెళ్లిరా- గోపీని తీసుకురా! Factory దగ్గరకే వెళ్ళివుంటాడు.

చెన్న:-అలాగేబాబూ ? (వెళ్ళిపోతాడు)

రామ:-నాన్నా —

నారా:-రామం —

రామ:-ఏమిటీ జరిగింది. ఏమిటీ ఘోరం -

నారా:-మానవచరిత్ర చర్విత చరణ మవుతోంది. ఒకప్పుడు, నా కొడుకును నీ కొడుకు లానేమాట్లాను. నీ తండ్రిని, నీ వెదిరించినట్లే నీ కొడుకూ ప్రయోజకుడయి నిన్నెదిరించాడు.

రామ:-మరి ఫలితం - జీవితం విషచక్రంలాగా, చేసిన తప్పులు చేస్తూ వుండవలసిందేనా! దీనికి అంతులేదా?

నారా:-ఉంది. అది యిప్పుడే జరిగింది - తండ్రిలో పశ్చాత్తాపం కలిగింది. కరెన్సీ నోట్ల తళతళలో వెండి నాణెముల గలగలలో, వినుపించని, మానవత్వపు ఆక్రందన శంఖనాదం చేసింది - ప్రేమ వెల్లువపొంగి, విడిపోయిన కుటుంబాన్ని ఒకటిగా చేసింది.

రామ:-మరి నేను చేసిందేమిటీ -

నారా:-నీవూ ఒకప్పుడు ఒక తండ్రికి కొడుకుననే మాట మరచిపోయావ్. లక్ష్మికోసం నీ తండ్రిని నీవు త్యాగం చేస్తే, దేశంకోసం గోపీ నిన్నెదిరించి, తండ్రికి మించిన కొడుకయ్యాడు - (ఇంతలో గోపీ చెన్నయ్య వచ్చారు.)

రామ:-గోపీ (కావలించుకున్నాడు. తల్లి కళ్లవెంట ఆనంద బాష్పాలు చిందాయి) (రామం లోపలికి వెళ్లాడు.)

లక్ష్మి:-బాబూ - గోపీ? వచ్చావా - (తల నిమిరింది.)

నారా:-అమ్మా! లక్ష్మి - గోపీ నీ కొడుకే కాదమ్మా మాతృదేశానికే ఒక వెలలేని మాణిక్యం. పేదవాళ్ల కన్నీళ్లు తుడవటానికి కన్న తండ్రినే లెఖ్ఖచెయ్యని, ధర్మవీరుడు. యువకులంతా గోపీనే, అనుసరిస్తే దేశానికీ దివ్యకల్యాణం. రాజ్యమే రామరాజ్య మవుతుంది.

రామ:-(లోపలనుంచి వచ్చి) గోపీ - నిన్ను క్షమాభిక్ష వేడుకోవటం, తండ్రిగా తప్పే అవుతుంది. అయినా మీకు చేసిన అన్యాయానికి నన్ను క్షమించండి. కానీ నేను వెళ్ళబోయేముందు నీకు కొన్ని విషయాలు చెప్పనీయ్ (Pause) ముందుగా, యీ తాళం చెవులు తీసుకో ?

గోపీ:- (ఆశ్చర్యపోయి) నా కెందుకు -

రామ:-ముందు తీసుకో - తర్వాత చెప్తా ?

గోపీ:- (తీసుకున్నాడు)

రామ:-ఇప్పుడు నీ ఆధిపత్యంక్రిందవున్న డబ్బు, షుమారు అయిదారు లక్షలు. వ్యాపారం మొదలుపెట్టింది, యాభయి వేలతోనయినా, రెండుసంవత్సరాలలో పెట్టుబడికి, పదింతలుగా సంపాయించాను. ఎలాసంపాదించానో నీకు తెలుసు- అన్యాయాలు, అక్రమాలుచేసి-

గోపీ:- అయితే-

రామ:-అయితే, యిదంతా నాకోసంకాదు- నీకోసం. నీ సుఖంకోసం- కానీ, దానికి భిన్నంగాజరిగింది. ఆశకు బానిసనై, నిన్ను వెళ్ళిపొమ్మన్నాను. నన్నే దైవంగా యెంచే గృహలక్ష్మిని అవమానించాను. కన్నతండ్రి మాటలను పెడచెవినిపెట్టాను. ఖాసింలాంటి పేదవాళ్ళ

సంసారాల్లో నిప్పులుపోశాను. చివరికి పేదవాళ్ల నెత్తుర్ని రూపాయలుగామార్చి, ఇనప్పెట్టెలోపెట్టి బంధించి, కాపలా కాయటం మొదలుపెట్టాను.

గోపీ:- నానా!___

రామ:-కానీ, కాపలావాడికిమాత్రం సుఖం వుంటుందంటావా? వుండదు- ఎన్నటికీలేదు- జీవితంలో సంతోషమూ తృప్తీ, మృగ్యమయిపోయాయి. దీనిలో ప్రతిరూపాయి ఒకమతిలేనిబాధ్యత. ప్రతిరూపాయి, ఒక దయ్యం- నన్ను బానిసగా చేసుకొని నాచేత వెట్టిచాకిరీ చేయించుకున్నయి, నాకూ, నాభార్యకూ, కొడుక్కూ, తండ్రికీ మధ్యనే కంచుగోడలు కట్టాయి. అగాధాలు త్రవ్వాయి. చివరకు నన్ను రాక్షసుడిగా చేసినయి.

లక్ష్మి:-ఊరుకోండి-

రామ:-సత్తువ సడలింది. ఆశయాలు, తారుమారయ్యాయి. మా పెద్దవాళ్ళతరాలు గడచిపోయినవి. ఇక నీదే బాధ్యత. ఈ యింటికిదేకాదు, ఈ దేశం బాధ్యతకూడా నీదే. నీలాంటి యువకులదే, ఈ దేశానికి ముందు కర్తలుమీరు. మీకుటుంబాలను, మీ దేశాన్ని మీరే దిద్దుకోవాలి. ఈ దేశమంతా ధనిక దరిద్ర,

తారతమ్యములేకుండా, ఒకే కుటుంబం కావాలి. ఈ రాజ్యం రామరాజ్యం కావాలి. అందరూ కష్ట పడి కృషిచేయాలి. అందరిసుఖంకోసం నీతండ్రి నెది రించినట్లే, దేశంలో స్వార్థపరులందరినీ ఎదిరించు. తప్పకుండా జయిస్తావు. అంతిమవిజయంనీదే. వస్తాను. వస్తాను నాన్నా- (లక్ష్మిదగ్గరికి వెళ్ళి నిలబడ్డాడు) (లక్ష్మి దుఃఖం ఆపుకోలేక కాళ్లమీద పడింది)

రామః—ఛీ- కన్నీరా- తప్పుకదూ- నీఆరోగ్యం జాగ్రత్త- పదండి గనేష్-

(గోపీ, నారాయణరావు, చెన్నయ్య, లక్ష్మికన్నీటితో రామంవైపు చూస్తుండగా, రామం గనేష్ వెళ్ళి పోతుంటారు.)

తమసోమా జ్యోతిర్గమయా
అసతోమాస ద్గమయా
మృత్యోర్మా అమృతమయ
ఓంశాంతి. శాంతి. శాంతిః"

(అనేశ్లోకం వెనుకనుంచి వినబడుతుండగా తెర.)



—♦—

